JAGATI Rs. 2-00 August 1991

36th Year of Publication




## ఆగష్టు - 1991

## సాహితీ సుధ

క్షమచే గా దవమాన మోర్చుట మహా సంతుష్టచే గాదు గే
హము నందైన సుఖంబు మానుట తపోవ్యాసక్తిచే గాదు దు
ర్దమ శీతోష్ణ జయంబు కాదు హరుపై ధ్యానంబు విత్తంబుపై
నమరెన్ మాకు మునీంద్రకృత్యములు లేవా సత్ఫలాభ్యున్నతుల్

—భర్తృహరి

ఆరామ సీమల యందు నుండి పవల్లు - ముద మెసంగ వసంతు డెదురు సూచు
ముని మాపు కడం గ్రొన్నన వింటి నెఱబోదు - కేళిమందిరముల కెలన జూచు
బ్రొద్దు పోయిన వేళ రోహిణి ప్రాణేశు - డుదిరి మేడల మీద వెదకి చూచు
దెల తెల వాఱంగ మలయ గంధవహుండు - సోరణ గండ్లలో జొచ్చి చూచు
నా పురి విలాసవతుల యొయ్యారములకు - గడు సొగసి వారి రాకలు కావి కావి
విరహుల గలంచు వారె యివ్విధముగాన - నున్న వారలనిక వేఱె యెన్న నేల

—చేమకూర వెంకటకవి 'విజయవిలాసం'

'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 50-00 - 4 సం॥లకు రు. 100-00 - జీవిత
చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలలో పాట్రన్ రు. 2000-00.

ముఖచిత్రం : ప్రధాని పివి నరసింహారావు

# నిమ్మతొనలు

అమ్మా, నువ్వు యిచ్చిన లెక్క యిప్పటికి పదిసార్లు చేశాను, - అన్నాడు శ్రీకాంత్.

పదిసార్లు చేసినా, పాతికసార్లు చేసినా కరెక్ట్ ఆనర్స్ రావాలి. అదీ ముఖ్యం. ఏదీ, ఆన్సరు చూపించు ?' అంది శ్రీకాంత్ తల్లి.

'పది సార్లూ పది అనర్లు వచ్చాయమ్మా !'

—ఆర్ పద్మావతి
విజయవాడ-2

భార్యా భర్తలు బీచి యిసుకలో కూచుని సముద్రం వంక చూస్తూండగా భార్య అంది: 'మీరు ఒక్కసారి కూడా నాతో గుడికి రాలేదు. మీకు దేవుడి మీద నమ్మకం లేదు.'

'అవును, లేదు' - అన్నాడు, గుళ్లూ గోపురాలూ దర్శించే అలవాటు లేని రఘుపతి.

'దేవుడు లేడంటే ఎలాగండీ ? - ఉన్నాడు. సర్వత్రా ఉన్నాడు' - అంది భార్య లలిత.

'దేవుడనేవాడే వుంటే, నీలాటి మొండి ఘటాన్ని నాకు భార్యగా చేస్తాడా ?'

—ఆరెస్ నాగేశ్వరరావు
మాచర్ల

రాంబాబు డాక్టరు కరుణాకరాన్ని అడిగాడు: 'సార్, నేను 93 ఏళ్ల బతుకుతానని జాతకంలో వుంది - నిజంగా బతుకుతానంటారా ?'

'జాతకంలో ఉంటే అబద్ధమెందు నిక్షేపంగా బతుకుతావు,' అని ధైర్యం చెబుతూ, ఇప్పుడు నీ వయసెంత ?' అని ప్రశ్నించాడు డాక్టరు కరుణాకరం.

'నలభై'

'సిగరెట్లు, డ్రింకు, రేసులు, అమ్మాయిలు, - యిలాటి వేమైనా వున్నాయా ?'

'అబ్బే, అలాటివాటి జోలికి పోనండీ'

'అలాటి వేమీ లేకుండా యింకో 53 ఏళ్లు బతకడం దేనికయ్యా ?'

—వి జనార్దనరావు
కాకినాడ-3

నుదుటి మీద ఆ బొప్పి ఏమిటి ? తలుపు గాని తల తగిలిందా ? - అని అడిగాడు స్నేహితుడు శ్యామలరావు, ఆఫీసులోకి వస్తున్న సుందరాన్ని.

'తలుపు కాదు, మా ఆవిడకు కోపం వచ్చి తన చేతిలో వున్న బౌండు పుస్తకం నా ముఖం మీదకి విసిరింది'

- అని సన్నగా చెప్పుకున్నాడు సుంద రం.

'అటువంటి ఆపత్సమయంలో చటుక్కున కూమండి పోతే, ఆ విసురు తప్పించుకోవచ్చు,' - అని అన్నాడు అనుభవజ్ఞుడైన శ్యామల రావు.

'నేనలా చేస్తానని ముందే గ్రహించి, గురిచూసి విసిరింది.

—జి వెంకట్రావు
కడప-4

సినిమా ఛాన్స్ కోసం వచ్చిన సుశీల కు మేకప్ టెస్ట్ అయాక, ప్రొడ్యూ సర్‌గారు అడిగారు: 'ఏమమ్మా, నీ వయసెంత ?'

'పదహారు' - అంది సుశీల.

'రెండేళ్ళ క్రితం వచ్చినప్పుడు కూడా పదహారే అనే చెప్పావ్ ?'

'సార్, మీకు తెలియని దేముంది నేనెప్పుడూ ఒకే మాటమీద నిలబడ తాను - ఇంకో పదేళ్ల పోయాక నా వయసు పద్దెనిమిది అవుతుంది'-అంది సుశీల చిరునవ్వుతో.

—కె అనూరాధ
కావలి

ఇంటర్వ్యూకి వెళ్లబోతున్న సోమ శేఖరం దిగ్విజయ్ సూటింగ్ క్లాత్ కొని, టైలర్‌కిచ్చి, అతను కొల తలు తీసుకున్నాక 'ఎప్పుడిస్తావ్ ?' అని అడిగాడు.

'పై నెల పదో తేదీన'

'నెలరోజులా ?' దేవుడే ఈ ప్రపంచాన్ని ఒక వారం రోజులలో సృష్టించగా, సూట్ కుట్టేందుకు.... అన్నాడు సోమశేఖరం.

'దేవుడంత తొందరబడటం వల్లనే కదా ప్రపంచమీతీరున వుంది....'

—యస్ జగన్నాధం
విశాఖ-1

పడవ ప్రయాణంలో తెడ్డుపైకి తీసి నప్పుడు, తెడ్డుపై మిలమిల్లాడే కాంతి చినుకులు నీటిలో కలవబోతాయి.

—బైరన్

---

# పాఠకుల తీర్పు



చందూర్‌గారూ, నమస్కారములు. 'జగతి'లో కేసరిగారి జ్ఞాపకాలు చదువుతూంటే, పుస్తకం వుంటే ఎంత బావుణ్ణు అని అనిపించింది. పుస్తకం దొరుకుతుందా? దొరికితే పంపించగలరా? మా గురువుగారు కె ఆర్ శ్రీనివాసయ్యంగార్ పూర్వం కచ్చేరీ వీధిలో వుండేవారు; ఇప్పుడు కస్తూరీ కాంప్లెక్స్‌కి మారినట్టున్నారు. వారి అబ్బాయి అంబిరాజన్ ఐఐటిలో ప్రొఫెసరు.... 'ది న్యూ వుమన్' (The New Women : The Women Writers of the 1890's) అనే సాహిత్య ప్రదర్శన రెండు వారాల పాటు జరుగుతుంది. ఆ సందర్భంగా వెలువడుతున్న పుస్తకానికి 'ముందు మాట' వ్రాసిన వ్యక్తిని - మార్గరెట్ డ్రాబల్‌ని - మీరొకసారి మద్రాసులో కలుసుకున్నట్టు చెప్పారు. మన రాజాగారిని, ఇతర మిత్రులని, మీ శ్రీమతిగారిని పలకరించేనని చెప్పండి.

—గూటాల కృష్ణమూర్తి
లండన్ S W 9 - 6 E E

చందూర్‌గారూ: మీ దంపతుల పట్ల మాకెంతో అభిమానం. ఈ అస్సామ్ వచ్చి రెండేళ్లు దాటింది. ట్రాన్స్‌ఫర్ ఆర్డరు కోసం ఎదురు చూస్తున్నాము. ఏప్రిల్ నుంచీ 'జగతి' అందడం లేదు. అక్కడ పోస్ట్ అవుతూనే వుండవచ్చు. కాని, మాకు చేరడంలేదు.

—కె నళినీదేవి
కరీమ్‌గంజ్ - అస్సామ్

చందూర్‌గారికి: నమస్కారములు. 1991 ఫిబ్రవరి మొదటి వారంలో 1990కి సంబంధించిన నాలుగు సంచికలు ఒకేసారి ఒకేరోజు పోస్టులో వచ్చాయి. ఆనందం, ఆశ్చర్యంతోబాటు చిరకాలమైత్రీ దర్శన సంతోషం కలిగింది.... వెనకొకసారి మీరు 'డైరీ'లో శ్రీశైల ప్రాంతంలో నరసంహారం గురించి వ్రాసినది నాకెంతో నచ్చింది. మీరు వేసే ముఖచిత్రంలో ఒక విలక్షణత ఉంటున్నది. విలక్షణతేగాక వివరణ కూడా వుంటే బావుంటుంది.

—అమ్మాజీ సర్కార్
అల్ హస్సా K S A

శ్రీ చందూర్‌గారికి: 'జగతి'తోను 'జగతి' ద్వారా మీతోను ఆత్మీయత, అనుబంధం వదలుకోలేని బలహీనత మాది. మా చిరునామా మార్పుని గమనించగలరు. ఆద్యంతం చదివింపజేసే చక్కటి పత్రిక.

—శర్వాణి
దేసనూర్ - కర్ణాటక

# వెన్నెల కెరటాలు

## వేరుశెనగ

వేరుశెనగలు, జీడిపప్పులు రెండు గూడా "Nuts and oil seeds" క్రిందికి వస్తాయి. వేరుశనగలు ఖరీదులో జీడిపప్పులకంటే చాలా తక్కువ ధర అయినప్పటికీ, ఆహారపు విలువలలో ఈ రెండు యించుమించు ఒకే స్థాయిలో ఉంటాయి. వేరుశనగలను ఎక్కువగా నూనె తీతకు, జీడిపప్పులను వంటకాలపై అలంకరణకు రుచికి ఉపయోగిస్తారు. వేరుశనగలు జీడిపప్పులలో ఆహారపు విలువలు యీ నిష్పత్తిలో ఉంటాయి. క్రొవ్వుపదార్థము 45 : 50%, మాంస కృత్తులు 22 : 28%, పిండిపదార్థములు 19 : 20%, ఖనిజలవణాలు కలిగి యుండును. ఇవేకాక విటమినులలో థైయమిన్, నయాసిన్, పాక్‌లోథినిక్ యాసిడ్ ఎక్కువ మోతాదులోను, రైబో ప్లెవిన్ కొద్దిగ తక్కువ మోతాదులోను వుండును. పోషక విలువలలో వేరుశనగలు జీడిపప్పులు ఒకేవిధముగా వున్నప్పటికి ఖరీదుబట్టి వేరుశనగలు అందుబాటులో వున్నవి.

—విజయ ఖాదర్
'కర్షకవాణి' లో

## యమ్మెన్ రాయ్

యుద్ధంలో ఫాసిజం గెలిస్తే భారత దేశానికి స్వాతంత్ర్యమే రాదు - అనే గట్టి నమ్మకం ఆయనకు కలిగింది. అందువల్ల మిత్రమండలివారి (బ్రిటన్, అమెరికా, ఫ్రాన్స్ వగైరా దేశాలు) యుద్ధ కృషికి మద్ధతు ఇవ్వడం అవసరమని ఆయన భావించాడు. కాని భారత జాతీయ కాంగ్రెసు దేశ స్వాతంత్ర్యానికి ప్రాధాన్య మిచ్చి, ముందు ముందు క్విట్ ఇండియా ఉద్యమానికి తయారవబోతోంది. ఈ స్థితివల్ల రాయ్‌కు కాంగ్రెసుతో భేదాభిప్రాయం కలిగి ఆ పార్టీనుంచి బైటకు వచ్చేసి, రాడికల్ డెమోక్రటిక్ పార్టీ స్థాపించాడు. ఇండియన్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్ అనే కార్మిక సంస్థను నెలకొల్పి, యుద్ధానంతర పునర్నిర్మాణం ఎలా జరగవలసిందీ కూడా సూచించాడు. ఫాసిజం ఓడిపోతేనే ప్రజాస్వామిక వ్యవస్థ నిలుస్తుంది. ప్రజాస్వామిక వ్యవస్థలో మాత్రమే ప్రజలకు హక్కులుంటాయి. ఇది ఆయన వాదం.

—డి రామలింగం
'యోజన'లో

# ఒ కేళ్ల నాటి పిక్చర్

రవీంద్రా వారి

## 'డాక్టర్ ఆనంద్'

ప్రతి డాక్టరూ ఒక ప్రజాసేవకు డైనట్టూ, ఆ డాక్టరులో ధీరలలిత ధీరోత్త లక్షణాలు వున్నట్టూ వెండి తెరమీద చూపడం పరిపాటి అయిపోయింది. రాజకీయ నాయకులు తాము బ్రతికుండగానే కాంస్య విగ్రహాలు ప్రతిష్ఠించుకుంటున్న కాలమిది. అయితే, ఈ డాక్టరు ఏ ఘనకార్యం చేశాడని కాంస్య విగ్రహం స్థాపిస్తారో మనకి బోధపడదు. లాడ్జింగ్ హౌస్ లాటి ఆ నర్సింగ్ హోమ్‌ని పద్మనాభం, రమణారెడ్డి, చదలవాడ వంటి వారు నిర్వహిస్తున్నందుకా ఆ గౌరవం ? - అనే సందేహం కలుగక మానదు. తమ చక్కని చల్లని యిల్లు, చక్కెర బొమ్మల్లాటి పిల్లలూ గురించి భార్యా భర్తలు పాడటం, ముక్కుపచ్చలారని తనయునికి తండ్రిగారు రష్యాలో బిచ్చగాళ్లు లేరని చెప్పడం సముచితంగా లేకపోయినా, నర్తకి విజయ (కాంచన) అర్ధనగ్నంగా డాక్టరుకి స్వప్న వాటికలో కనిపించేదాకా, రసపోషణ చెడలేదు ; చిత్రం సాఫీగా సాగుతుంది. ఎప్పుడైతే విజయని కలుసుకునేందుకు వెళ్లిన డాక్టరుకి (యన్టీ రామారావు) తన అపూర్వ సహోదరుడు (ముమ్మూర్తులా తనని పోలినవాడు) కనిపిస్తాడు. అక్కడితో కథాగమనం వింత పోకడలు పోయి, వంకర దారులు తొక్కుతుంది. ఫార్ములా సన్నివేశాలతో మనని సంతోష పెట్టేందుకు ప్రయత్నిస్తారు. భార్య రోగిష్టిది ; తను వయసులో ఉన్నవాడు ; ఒక అందాల దీవి తనని ఆహ్వానిస్తోంది. అటువంటప్పుడు, ఆ మనోజ్ఞ సీమ చేరుకునేందుకు, తన లోని డాక్టరుని చంపుకోవలసిన అగత్య మేమిటి ? లక్షలు వెచ్చించి ప్రేక్షకానందం కోసం చూపించే కథకు కాళ్లూ చేతులూ వుండాలి.... డాక్టర్ ఆనంద్ పిరికివాడా ? లేక, ఏకపత్నీ వ్రతుడా ? రెండూ కాదు. ఆ పాత్రలో జీవలక్షణం కొరవడినట్లు అనిపిస్తుంది. జన బాహుళ్యాన్ని ఆకర్షించే కృతక సన్నివేశాలూ, కనువిందైన దృశ్యాలూ, శ్రవణ పేయమగు పాటలూ - యివే ముఖ్యమనుకున్నారు. పెరుగుతున్నదీ హృదయమూ, తరుగుతున్నదీ ప్రాయమూ అనే సార్వజనీనత గల గీతం, ప్రతి గుండెనీ కదిలిస్తుంది. దర్శకత్వం : మధుసూదనరావు.

—యన్నార్ చందూర్ సమీక్ష.

'జగతి' - డిసెంబరు 1966

# మానవ ప్రగతి

## సముద్రపు తాబేళ్లు

అంతరించిపోయే ప్రమాదంలో పడిన అయిదు రకాల సముద్రపు తాబేళ్ల పరిరక్షణకు చర్యలు తీసుకోని పక్షంలో కొన్ని లాటిన్ అమెరికన్ దేశాల నుంచి వచ్చే రొయ్యల దిగుమతుల మీద నిషేధం విధించగలమని అమెరికా తెలియజేసింది. కెంప్స్ రిడ్లే, హాక్స్‌బిల్, లాగర్‌హెడ్, లెదర్ బాక్, గ్రీన్ సీ టర్ట్‌ల్స్ అనే అయిదు రకాల సముద్రపు తాబేళ్లు ఇప్పుడు అంతరించిపోయే ప్రమాదంలో పడ్డాయి. గల్ఫ్ ఆఫ్ మెక్సికోలోను, ఇంకా అట్లాంటిక్‌లో ఉత్తర కరోలినా వరకు రొయ్యలు పట్టేవారు. ఈ రొయ్యల వేటలో తాబేళ్లు మాత్రం తప్పించుకు పోయే వీలు కల్పించే ఖరీదైన 'వేట పరికరాలను' వినియోగించాలని అమెరికా 1987 లో నిర్దేశించింది. 1989 లో అమెరికా చేసిన ఒక శాసనం ప్రకారం.... సముద్రపు తాబేళ్ల పరిరక్షణకు చర్యలు తీసుకోని దేశాల నుంచి రొయ్యల దిగుమతులను అమెరికా నిషేధించవలసి వుంటుంది. ట్రినిడాడ్, టొబాగో, ఇంకా మెక్సికో, బ్రెజిల్ తీరాల వెంబడి కరీబియన్, అట్లాంటిక్‌ల ప్రక్కన గల మెయిన్‌లాండ్ దేశాలు తాబేళ్ల పరిరక్షణకు చర్యలు తక్షణం తీసుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. అమెరికాలో రొయ్యల వేటకు చిన్న చిన్న పడవలను ఉపయోగించేటట్టయితే అవి తమ 'వేట' సమయాన్ని పరిమితం చేసుకోవాలని, వలలను తరచు పరీక్షించి నాటిలో పడిన తాబేళ్లు ఊపిరి అందక చనిపోక ముందే వాటిని వలల నుంచి వదిలిపెట్టాలని అమెరికాలో అమలులో వున్న ప్రస్తుత శాసనం నిర్దేశిస్తున్నది. కాగా ఈ ఆంక్షల అమలు విజయవంతం కావడం లేదట.

(అమెరికా సమాచారశాఖ)

## నర వానరాలు

మారిన వాతావరణానికి అనుగుణంగా తమ జీవన విధానాన్ని మార్చుకోలేని అనేకరకాల వానరాలు అంతరించాయి. మార్పులకు అను

కూలంగా తమ్ము తాము మార్చుకో గలిగినవి మాత్రమే, తమ మనుగడ సాగించాయి. నర వానరాలు చెట్లు దిగి, నేలపై జీవించడానికి దోహదం జేసిన ఏకైక కారణం - తిండియే. అరణ్యాలు క్రమేణా క్షీణించడం వల్ల, చెట్లపై మాత్రమే జీవించ కలిగిన వానరాల కన్నా భూమ్మీద బతక గలిగిన నాటికే, కాళ్ళతో నడుస్తూ చేతుల్తో వస్తువుల్ని పట్టుకో గలిగిన వాటికే తిండి దొరికే అవకాశముంది. నిటారుగా నిలబడి రెండు కాళ్ళతో నడవడం, నర వానరాల ప్రగతికి అపూర్వకంగా తోడ్పడింది. చేతులకు (ముందు కాళ్ళకు), నడక తగ్గిన ఫలితంగా, చేతుల్తో వస్తువుల్ని పట్టు కొని, రక రకాల పనులు జేయడానికి అవి ప్రారంభించాయి. రెండు కాళ్ళతో నడవడం, రెండు చేతుల్తో పనిచేయ డం, మెదడు పెరగడం, ఈ మూడు లక్షణాలూ - పరస్పరం సహక రించిన ఫలితంగా, ఈ మూడూ క్రమంగా అభివృద్ధి జెంది, నర వానరం నించి ఆదిమ మానవుని ఆవిర్భావం జరిగింది. దాదాపు రెండు కోట్ల సంవత్సరాల క్రితం "డయొ పితికస్" అనే వానరం నుండి "జిగాంటో పితికస్" ఉద్భవించింది. ఈ రెండు వానరాలూ అనంతర కాలంలో అదృశ్యమయ్యాయి. జిగాంటో పితికస్ నుండి జనించిన వానరాన్ని, గొరిల్లా అని అంటారు. ఈ నాటికీ ఇవి మనకు అక్కడక్కడ కనిపిస్తాయి. టాంగానీకాలో (దక్షిణా ఫ్రికా) అల్డ్‌వాయ్ వాయ్‌గార్జ్ వద్ద లీకీ దంపతులకు, 20 లక్షల ఏళ్ల నాటి వానరానికి చెందిన పుర్రె, పిక్క ఎముకా, వాడిన కొన్ని పరి కరాలు దొరికాయి. అంచుల వద్ద చెక్కి, పరికరాలుగా వాడేందుకు వీలుగా తయారు చేయబడ్డ ఇవి - మామూలు కళ్ళకి గులకరాళ్ళుగా మాత్రమే కన్పిస్తాయి. ఈ రకమైన అవశేషాలూ, వాడిన పరికరాలూ ఎక్కువగా ఆఫ్రికాలోనే దొరకడం వల్ల, నరవానరం నరుడుగా పరిణా మం చెందింది - ఈ ఖండంలోనేనని పాశ్చాత్య శాస్త్రజ్ఞులు భావిస్తోండగా, ఆసియాలోనే ఈ పరిణామం జరిగిం దని రష్యన్ శాస్త్రవేత్త యైన మైఖేల్ నెస్టూర్క్ వాదిస్తోన్నాడు నర వానర కుటుంబంలో ముఖ్యంగా నాలుగు దశలున్నాయి. 1. ఆస్త్రలో పితికస్ 2. పితికాంత్రోపస్ ఎరక్టస్ 3. సైనాంత్రోపస్ 4. నియాం డర్తాల్. వానరం నించి నరుడుగా మారడానికి జరిగిన సుదీర్ఘ పరిణా మంలో, ఈ నాలుగూ నాలుగు ప్రధాన దశల్ని సూచిస్తాయి.

(అమ్మాజీ సర్కార్ - గల్ఫ్)

## పిర్యాదులు

రైళ్ల ద్వారా రోజుకి కోటిమంది ప్రయాణీకులు ప్రయాణం చేస్తుండగా, సుమారు పది లక్షల టన్నుల సరుకుల రవాణా జరుగుతోంది. ఈ బృహత్తర కార్యక్రమం, క్షేమంగా సాఫీగా సాగిపోయేందుకు భారత

రైల్వేలు విస్తృతమైన చర్యలు చేపట్టాయి. ఇందుకు గాను భారత రైల్వేలచే 7 వేల పని కేంద్రాలలో నియమితులైన 18 లక్షల మంది ఉద్యోగులు ఎంతో సమన్వయంతో, ప్రజలకు ఎటువంటి ఇబ్బందీ కలగకుండా చూసేందుకు అహర్నిశలు కృషి చేస్తున్నారు. అయినప్పటికీ 1989–90 సంవత్సరంలో రోజుకు సగటున 70 చొప్పున మొత్తం 25,230 ఫిర్యాదులు అందాయి. ఇదే కాలంలో ప్రయాణం చేసిన 365 కోట్ల మంది ప్రయాణీకుల సంఖ్యను, రవాణా అయిన 33 కోట్ల టన్నుల సరుకును పోల్చి చూసినట్లయితే, ఈ ఫిర్యాదుల సంఖ్య అంత ఎక్కువేమీ కాదని చెప్పవచ్చు. టిక్కెట్ల బుకింగు, రిజర్వేషన్లు, టిక్కెట్ల డబ్బు తిరిగి చెల్లింపు, రిజర్వు చేసిన రైలు పెట్టెలలోకి ఇతర ప్రయాణీకుల ప్రవేశం, పార్శెళ్ల బుకింగు, రైళ్లలో శుభ్రతా నిర్వహణ, రైళ్ల రాకపోకలలో ఆలస్యం, సామాను చోరీ, లంచగొండితనం, రైల్వే సిబ్బంది అమర్యాదకర ప్రవర్తన వంటివి రైల్వే అధికారులకు అందే ముఖ్యమైన ఫిర్యాదులు. (త్రిపాఠి - పి ఐ బి)







# నా రాట్న చక్రం

## తల్లాప్రగడ ప్రకాశరాయుడు



గాంధీ గారికి సత్యాగ్రహోద్యమం, నిర్మాణ కార్య క్రమం రెండు నేత్రాల వంటివి ; రెండూ పరస్పర ఆశ్రితాలు. స్వాతంత్ర్య పోరాటంలో ఒక భాగమైన 'వ్యక్తి సత్యాగ్రహానికి' ప్రప్రథములుగా ఆయన వినోబా భావెని ఎన్నుకున్నారు ; జవహర్‌లాల్ నెహ్రూ రెండవవారు. 'జాతి పిత'గా దేశం గాంధీజీని గౌరవించి, సర్వోదయ సిద్ధాంతానికి కాస్త ఊపిరి నిచ్చిందే గాని, గాంధేయ పథం విస్మృతి పథాన పడింది.... రాజకీయ పదవులు ఆశించకుండా, గాంధీజమ్‌కి కట్టుబడి, నిర్మాణ కార్యక్రమానికి అంకితమైన మహానుభావులలో తల్లాప్రగడ ప్రకాశరాయడు గారొకరు.... ఇరవైఏడేళ్ల క్రితం అమ్మమ్మ గారు (బెన్నూరి కృష్ణవేణమ్మ - దుర్గాబాయి గారి తల్లి) ప్రకాశ రాయడి గారి వ్యక్తిత్వమూ, త్యాగశీలత గురించి చెబుతూండే వారు. పదిహేనేళ్ల క్రితం ఆ మహనీయుని హైదరాబాదు ఆంధ్ర మహిళా సభ గాంధీ మందిర్‌లో కలుసుకోగల అవకాశం లభించింది - ఆ అవకాశాన్ని కల్పించినవారు ప్రియ మిత్రులు బివిడి నారాయణరావు గారు - అంటే దుర్గాబాయి గారి తమ్ముడు. ప్రకాశరాయడుగారు ఆ రోజున మాకు 'నివేదన' పుస్తకం యిచ్చారు ఎంతో ప్రేమగా.... ఆరేళ్ల క్రితం గాంధీ క్షేత్రం నుంచి 'నా రాట్న చక్రం' సమీక్షార్థం రాగానే, ఒక్క బిగిని చదివి, ముగించాను. రఘుపతి వెంకటరత్నం నాయుడు, మహాత్మాగాంధీ వల్ల ప్రభావితుడైన సద్విద్యాధికుని

జీవిత మజిలీలు కళ్లకి కట్టినట్లు కనిపించాయి...." కేసరి గారి 'చిన్ననాటి ముచ్చట్లు' చదివి మెచ్చుకున్న పాఠకులు, అటు వంటిదే మరొకటి వేయమని కోరగా, ప్రకాశరాయడి గారి జీవితం సంక్షిప్త పరిచయం చేదామని అనిపించి, బుద్ధప్రసాద్ గారికి, రాజారామ్ గారికి అనుమతికోసం వ్రాశాను. ఇరువురూ వెంటనే అంగీకరించినందుకు మా మనఃపూర్వక కృతజ్ఞతలు.



నా పుట్టుక 1893 ఏప్రిల్ 15. దానిని గూర్చి ఒక చిన్న కథ వుంది. మా అమ్మ పుట్టిల్లు ఉంగుటూరు ప్రక్కనున్న రావులపఱ్ఱు కుగ్రామం. గ్రామజనాభా సుమారు వేయిమంది. అప్పుడవి కృష్ణాజిల్లా వూళ్లు. తరువాత అవి పశ్చిమగోదావరి అయినాయి. రావులపఱ్ఱంటే మా మేనమామగారి ఊరు. తండ్రిగారు నా ఆరేడేళ్ల వయస్సులో చనిపోవడంవల్ల మా అమ్మ, నేను, నా చెల్లెళ్ళిద్దరు - నలుగురి బాధ్యత మా మేనమామ పై (అమ్మకు తమ్ముడు) పడ్డది. ఉంగుటూరు మాగాణిపొలం 40 యకరాలు. పొరుగూరిలో మరేవో మెట్టపొలాలుండేవి. తండ్రిగారు ఏడువేలు అప్పు చేశారు. అయన పోగానే అప్పుల 'ళ్ళొచ్చి బాకీలు తీర్చమని చేశారు. నేను ఆరేండ్ల మైనర్ను. మేనమామ (అదూరి శేషయ్య) వయస్సు ఇరవై యేండ్లు దాటియుంటుంది. ఆకింగు గ్రామ కరిణీకం పని చూస్తున్న పినతండ్రి కామరాజుగారి నుండి కరిణీకపు దస్తరం తీసుకొనియుంటాడు. కామరాజుగారు గొప్ప సంగీత పాటకుడు.

అప్పులవాళ్ల బాధ - మేనమామ చిన్నతనం - నేను ఆరేండ్ల మైనర్ను! మా ఆస్తి కొనడానికి ఎవ్వరూ చొరబడ లేదు. నేను పెద్దనై మైనరుదావా తెస్తానని భయం. ఋణబాధను మించిన కష్టం ఏదీ లేదంటారు. జీవితంలో ఆ భాధ యేమిటో ఆ తరువాత నాకు బోధపడ్డది. నే నెప్పుడూ ఋణాలు చేయలేదు.

## మా కుటుంబం

మాతాపితల స్మృతి తత్తుల్యంగా చెల్లెళ్లను గూర్చిన జ్ఞాపకాలు నా మనసున ఈనాటివరకూ చెరిగిపోలేదు, పోవు. "Nivedana" అనే నా యింగ్లీషు వ్యాసాల పుస్తకాన్ని పెద్దవారి ముగురకూ అంకిత మిచ్చుకుంటూ, తండ్రి గూర్చి "This 'Nivedana' is humbly dedicated to my humble family of old. To father, who barely knowing the ancient three R's, had taught me many things, without the use of a book and taken me into Nature's lap of beauty, but died, before I was seven

... To my unlettered mother, who lived up to seventy or more and whose sole care had been to mould the character of her three children to the best of her intelligence and disciplined affection,... And no less in fond and proud remembrance of my two younger sisters, who died young, piling their life spans too on me (now aged eighty two) and who (the two angels) lived pure, spoke true and righted wrong'' అని వ్రాసుకొన్నాను.

తండ్రి లక్ష్మయ్యను గూర్చి, ఇతరుల కక్కరలేని ఏవో కొన్ని మాటలు మనసుకు వస్తున్నాయి. జ్ఞాపకమున్నాయి కనుక చెపుతున్నానంతే. కుటుంబ గౌరవాన్ని నిలుపుకుంటూ కర్షకుడుగా తన భూముల్లో సేద్యం చేస్తూ చేయించుకుంటూ కేవలం సేద్యం మీద ఆధారపడి బ్రతికిన వాడాయన. పొలం పనివాళ్లు శూద్రులు మాలలు కూడ ఉండేవారు. మాలలను దూరంగా తొలగిపొమ్మనడం శూద్రులపట్ల అంటరానితనం ఆయన పనిబూని పాటించేవాడుకాడని ఆ చిన్న ప్రాయంలోనే నాకు బాగా గుర్తు. బ్రాహ్మణ భేషజాలను పెంచుకొని సర్కారు ఉద్యోగాలు చేసే పెద్దింటి నియోగులవలెను, మంత్ర తంత్రాలు చదువుకొని గృహకార్యాలు చేయించే వైదిక బ్రాహ్మణులవలెను ఈయన అంతగా కులభేదాలు పాటించేవాడుకాదు. ఇట్టి యీయన నడవడి నాకు బాగా జ్ఞాపకముంది. సంఘంలో అస్పృశ్యత ఉండరాదనే సంస్కరణ దృష్టి కలవాడు కాడాయన. వాళ్ల నుండి యెడం పాటించకుండ దగ్గరగా తిరుగుతూండటం ఆయనకుండిన అలవాటు మాత్రమే. పొలంపనియే ఆయన వృత్తి కావడం, దినమంతా పాలికాపుల (పాలేళ్ళ)తోనే ఆయన జీవితం గడిచియుండటమే, వాళ్లతో ఎట్టి అరమరిక లేకపోవడానికి ముఖ్య కారణమని తోస్తుంది. తన పనివాళ్ల కష్టసుఖాలను కనుగొంటూ, వాళ్ల కన్నివిధాలా సాయపడే గుణం ఆయనలో చాలా వుండేది. కొన్నేండ్ల పిమ్మట నేనెక్కడో చదువుకుంటూ, ఇంటికివచ్చి, గ్రామంలో కనబడితే, ఆ శూద్రులు మాలలుగూడ అతి గౌరవ ప్రేమలతో నన్ను వీధిలో ఆపి, నేనెవర్నో అడిగి తెలుసుకొని, "బాబా, లచ్చయ్య దొర గారి కొడుకువా నీవు - నీకు దణ్ణ" మంటూ వినయ విధేయతలతో పలుకరించేవారు.... మా తండ్రి చదువుకున్న పండితుడుకాడు, ఏమీ తెలియనవాడూ కాదు.... ఉంగుటూరు స్కూలులోని పురాతన ప్రయమరీతో ఆయన చదువు అయిపోయింది. ఆయన ప్రావీణ్యమంతా మాగాణిపొలం సేద్యం మీదను, నీలాద్రిపురం అడవి చెట్ల తోట మీదను చూపించేవాడు. తనకుండిన వరిపొలాల కుప్పనూర్పిళ్లకు, నువ్వుపంట కళ్లాలకు రెండెడ్లబండి మీద తనతోపాటు నన్ను తీసుకొని వెళ్లేవాడు. తానే బండి తోలేవాడు. దీర్ఘమైన ఆ బండి ప్రయాణాలలో

ఎద్దుల మెడలకు కట్టిన గంటలుండేవి. ఒక యెద్దుకు కేవలం రేకుతో చేయబడ్డ పెద్ద బొణగ గంట, రెండోదాని మెడకు కంగుమని కంచు ధ్వని నిచ్చే చిన్నగంట ఉండేవి. ఎద్దులు పుష్టిగాను చురుకుగాను ఉండేవి. గంటలు రెండూ కలిసి ఏకసమయంలో ఛేసే రమ్యమగు ద్వంద్వరవళి ఈ నాటికి గూడ నా కర్ణపుటాల్లో ధ్వనిస్తూన్న దంటే, నమ్మండి.

ఆ తోటలో ఏవేవో (అంటు మామిడి పెద్దపండ్లవికాక) రకరకాల మామిడిచెట్లు, వెలగ, చింత మున్నగు ఫలవృక్షాలు తాళవృక్షాలు ఉండేవి. ఆ కాలం నుండి నేటివరకూ తోటపని యంటే నేను చెవికోసుకుంటాను. నివాస గృహానికి కాస్త పెరడు లేక వాకిలి ఖాళీ దొరికితేచాలు, అది శుభ్రం చేసుకొని ఏవైనా పనికి వచ్చే పాదులు, మొక్కలు, నీళ్లుపోసి పెంచుతూ కలుపుతీస్తూ వాటి మధ్య కూర్చుని కాలక్షేపం చేయడం నాకిష్టం. ....ఉంగుటూరు గ్రామదేవత పేరు 'చల్లాలమ్మ'. ఆమె పుట్టింది మాయింటనేయని ఒక వాడుక. ఇంటియజమాని మా తండ్రేకనుక గ్రామదేవత సేవలు ఊరేగింపులు (జాతర్లంటారు వాటిని) జరిగే సమయాల్లో వీథిలో బాజా మ్రోగేసరికి మా తండ్రి యింటి బయటకి వచ్చి ఒక పేంబెత్తం వేపాకు చేత బట్టుకొని కండ్లుమూసుకొని ఇంటి ముంగిట నిలవడం; ఆ పరిసరాల స్త్రీలు బిందెలతో నీళ్ల తెచ్చి, అయన పాదాలపై కుమ్మరించడం నేను కళ్లార



చూచిన దృశ్యం. ఆనాడు గ్రామ దేవతంటే అన్నికులాల వాళ్లకూ భయమే. మొక్కుబళ్లూ, సేవలూ, కొలుపులూ చేయించకపోతే, ఆ తల్లి ఏంచేస్తుందో, ఏ కీడు మూడుతుందో అనే గుండెబెదరు. ముఖ్యంగా కలరా మహావికాలమీద ఆమెదే ఆధిపత్యం. ఆ బాల్యంలో నాది కూడ జనసామాన్యపు అభిప్రాయమే అయియుంటుంది. కాని, 1910 రాజమండ్రి వీరేశలింగం పంతులుగారి హితకారిణీ స్కూలు 'యస్ యస్ యల్ సి' చదువుతో పాటు, గ్రామదేవతల కథలు వాటి భయాలు పిచ్చినమ్మకాలనిపించి, వాటిమీద నాకొక నిర్లక్ష్య నిరసన భావం యేర్పడ్డది. చల్లాలమ్మ భక్తుడు గణాచారి అయియుండిన మా తండ్రి చివరకు కలరాసోకి చనిపోయినాడు. నమ్మినభక్తుణ్ణి యింతమోసం చేసిందని చెప్పి మా అత్తయ్య (నాన్న అక్కగారు) చల్లాలమ్మను తిట్టిపోయడం గూడ నాకు జ్ఞాపకముంది. మా తండ్రి బ్రతికిందల్లా రమారమి 40 యేండ్లు. ఆయన అచ్చ గ్రామీణుడు. అరుదుగా పొరుగూళ్లకు ప్రయాణమప్పుడే చొక్కా తొడుక్కునేవాడు. గ్రామంలోను యింటను పంచెకట్టు, పైన ఉత్తవాస్త్రంతోనే తిరిగేవాడు. సోమవారం గ్రామంలో సంతకు వెళ్లి కూరగాయలు పంచెకొంగున వేసుకొని తెచ్చేవాడు. కేవలం సేద్యవృత్తికి అలవాటుపడిన వారిలో నుండే సాదాగుణమిది. ఈ వృత్తిలోనే ఒకవిధమైన దైవత్వముంటుందని నాలో యేర్పడియున్న ఒక నమ్మకం. కర్షకుడే ఈ పృథ్విపై భగవంతుని మొదటివారసుడు.

నా చిరుతప్రాయంలో నాకు అక్షరజ్ఞానం కలిగించడం ఆయన విస్మరించలేదు. ఒక 'పెద్దబాలశిక్ష' పుస్తకం ఆయనవద్ద నుండెనని నాకు జ్ఞాపకం. దానిని మొదట కూర్చిన మహనీయుడెవరో కాని, అది తెలుగు బిడ్డల పాలిట నిఘంటువే నిజంగా. అందులో లేని విషయమేలేదు. ఇటీవల కాగితాలను ఖరాబ్ చేస్తున్న ఎంగిలి పుస్తకాలు ఎన్ని పుడితేనేమి గిడితేనేమి? 'పెద్దబాల శిక్ష' ఇప్పటికీ పెద్దలిపితో అచ్చు పడుతూనే వుంది. "ఓం నమశ్శివాయ"తో "విద్యారంభం విరిష్యామి" ధ్వని ఏ మూలనైనా కనవస్తోందా?

## 3
## ప్రాథమిక పాఠశాల

నా మూడోయేటకాబోలు, దేశాచారరీత్యా పుట్టు వెండ్రుకలు తీయించారు మావాళ్లు. దక్షిణవైపు యింటి అరుగు ప్రక్కనున్న వసారాలో చిన్న ధాన్యరాసి పైన పీటవేసి కూర్చోబెట్టారు. జుట్టు కత్తిరించి ఆ ధాన్యాన్ని పట్టుకు పోయినాడు మంగలి. ఇంటి మంగలి రంగడు పెద్దమనిషి. అతని తమ్ముడు పుల్లయ్య కోపధారి, ఎందుకీ మంగళ్ళ, చాకళ్ళ వర్ణన అనకండి. ఎందుకేమిటి - జ్ఞాపకమున్నారు కనుక. నాన్న, అమ్మలఅంకె వలనేవాళ్ళుగూడ

యింటి మనుషులాగున ఉండేవారు గనుక. పాలేళ్ళ పేర్లు గూడ ఒంట బట్టి యున్నాయి. మాలపాలేరు కొంచెం దూరంగా మసలినా, అతడూ యింట్లో మనిషి లాంటివాడే, పసి పిల్లల దృష్టిలో.

1900 సంవత్సర ప్రాంతంలో ఉంగుటూరు ప్రాథమిక పాఠశాల, దోనేపూడి శేషయ్యగారి ఖాళీ యింట్లోను దొడ్డి వసారాలోను ఉండేది. చుండూరి వెంకయ్యగారు పెద్ద మాష్టరు. చిన్నప్పుడు ఈతచెట్టెక్కి పడితే ముళ్ళుగుచ్చుకొని సెలలువేసి కుడిచెయ్యి సగం తీసివేశారట. నాటి నుండి అన్నిపనులూ ఎడమచేతి తోనే. ఆ ఎడమచేతి దస్తూరీ ముత్యాలకోవలా గుండేది. పైన కప్పుకున్న కండువా చెంగులు ఆ కుంటి కుడిచేతి క్రింద దూర్చేవాడు. దాని క్రిందనే ఒక పేంబెత్తం జూక కూడ ఉండేది. ఆయన పురాతన మెట్రిక్యులేషన్ ప్యాసయినాడట. ఆ కాలంలో అదే గొప్ప. పిల్లలకు నేర్పేవి తెలుగు భాష

మాత్రమే. A. B. C. D.లు లేనేలేవు. ఇప్పడిహ మూడేళ్ళ దాటకుండా పిల్లల్ని బలవంతాన బళ్ళోపడవేయడం (పారవేయడమే) చెల్లించవలసిన డొనేషన్లు, అడ్మిషన్ ఫీజులు తలమునకలైన నెలజీతాలు. యిలాటివిలేవు. ఉంగుటూరు ప్రైమరీస్కూలు మొదటి తరగతి నెల జీతం రెండణాలు నాల్గవ తరగతికి నాలుగణాలు, మొదట కొన్నాళ్ళ పేడతో అలికి శుభ్రం చేసిన నున్నని నేలమీద వెలిబూడిద చల్లి, దానిపై తేలికగా అక్షరాలు దిద్దించేవారు. రామనాథ శాస్త్రిగారు (చీవుకుల) ; రెండోమాస్టరు – చిన్నమాస్టరనేవారు. మూడోవారు పమ్మి సూరయ్యగారు. శాస్త్రిగారు సంస్కృత పండితులు కూడ. ఉదయ స్నానం, జపం పొడుగైన పిలకజుట్టు చివరి ముడిలో ఎర్రని నిత్యమల్లిపువ్వొకటి వ్రేలాడుతుండేది. ముగ్గురవీ ఆనాటి బ్రాహ్మణ పద్ధతి దుస్తులు - పంచె, పైన ఉపవస్త్రం. స్కూళ్ళ అధికార్లు పరీక్షకు వచ్చినపుడు మాత్రం చొక్కాలు వేసుకొనేవారు. వెంకయ్యగారికి రు 15/- నెల జీతం. ఉంగుటూరిలో పోస్టాఫీసుండేది. పోస్టు మాస్టరు అయ్యన్న గారి జీతం రు 7/-లు. పోస్టుకార్డు ఖరీదు ఒక కాని. అంటే మూడుదమ్మిడీలు. కవరు అర్ధణా. ఇన్స్పెక్టర్లు - ఆకాలంలో అందరూ బ్రాహ్మణ కులస్థులు. మా బడియంతలో ఆడపిల్లలు కూడ యిద్దరో ముగ్గురో వుండేవారు. ఆనాటి విద్యార్థుల పేర్లు బహుకొద్దిగా జ్ఞాపకమున్నాయి. బల్లకట్టునడిపే లేళ్ళ కనకయ్య కొడుకు స్వామి ; కొండ్రెడ్డి సీతమ్మ ; కోమటి రంగయ్య. పెద్దవాళ్ళైన తరువాత, కాలువ వంతెనప్రక్క రంగయ్య మిఠాయిదుకాణం పెట్టి, ఎపుడైన నేను పొరుగూరు వెడుతూ వంతెన దాటుతూండగా నన్ను ఆపి, ఏదో చిరుతిండి పొట్లంకట్టి నా చేతపెట్టి, 'ఎందుకిది, రంగయ్య' అని నేనంటే, 'తినండి బాబు! మళ్ళీ ఎన్నాళ్ళకో మీరు కనబడుట' మంటూ, దుకాణ మెవరికో అప్పగించి, దిగివచ్చి నన్ను కొంత దూరం సాగనంపే వాడు. అతని ప్రేమాతిశయం మరువడ మెట్లా? అయిదో యేట నాకు అక్షరాభ్యాసం చేసినవారు మూడో మాస్టరు పమ్మి సూర్యయ్యగారు.

హిందూ ధర్మ సంప్రదాయంలో దేని అవసరం, ప్రాముఖ్యం దానికే వుంది. హిందూ స్త్రీలు నోములు పడతారు. ఒకటా రెండా? లెక్కకు ఏభై అరవైకి మించి యుంటాయి 'మూగనోము' అన్నది కూడ ఒకటుంది. అందలి భావం తెలుసుకొని ఆచరిస్తే, దాని ప్రయోజనం దానికుంది. పండుగుల పబ్బాల సంఖ్యే బోలెడంత! విశాల ధర్మరంగ స్థలం. ఏకోశానా స్వార్థం, క్రౌర్యం లేని వేడుకలతో గూడిన ధర్మ జీవనస్రవంతిగా జీవితాలను తయారుచేసుకున్నారు మన వారు. వీటన్నిటికీ ప్రాతిపదిక, సరియైన విద్యాభ్యాసం. అట్టి సాంప్రదాయక ప్రాథమిక విద్యాభిక్ష, నా కొసగిన వారు మా మూడో మాస్టరు, సూరయ్య

గారు. ఆయన వ్రాయించిన అ, ఆ, ఇ, ఈ లు కావు. నా నోట ఆలపిస్తూ వ్రాయించిన 'ఓమ్ నమశ్శివాయ' లోనే, అందలి మొదటి మంత్రాక్షరం లోనే చదువులన్నిటిలోని సారభూత సత్యం వున్నదని తరువాత గ్రహించాను. ఇంకా గ్రహిస్తూనే వున్నాను.

వెంకటరత్నం నాయుడు ఆయన గురుత్వంవల్ల కొన్ని మంచి అలవాట్లు శిష్యుల కబ్బియుంటాయి.... ఉంగుటూరు పేరు చెప్పి ఏభై, అరవై బ్రాహ్మణ కుటుంబాలుండేవి, అందెక్కువ మంది వైదికులు. శుభాశుభకార్యాలు చేయించే పురోహితులు. ఆ పనులు బహు నియమ నిష్ఠలతో చేసేవాళ్ళకూ, చేయించుకునే వాళ్ళకూ తృప్తికరంగా ఉండేవి. ఇప్పుడట్లా కాదు. చాలామంది పట్న వాసాలకు చేరి, పౌరోహిత్యాన్ని డబ్బు గుంజుకునే వర్తకంగా మార్చివేశారు. చేతికి రిస్టువాచ్‌తో, సైకిళ్ళెక్కి, మస్తుగా బ్రాహ్మణీకా లుండటం వల్ల, బ్రాహ్మడు మధ్యాహ్నం ఏ యింటికి ఎన్ని గంటల కొస్తాడో తెలియదు. వచ్చేవరకూ గృహస్థులు పడిగాపుల పడి విసుక్కుంటూ కూర్చోవలిసిందే.

✤

డబ్బు బేరం ముందు మాట్లాడు కుంటాడు. బేరం కుదరకపోతే రానే రాడు. ఒకప్పుడు నమ్మకంగా వైదిక కర్మలు చేయించిన వారి సంతతి వారే వీరందరూ. పురాతనం, పునీతం అగు పురోహిత ధర్మం ఇండియాలోనే కాదు ప్రపంచమంతటా నశించి, డబ్బు లేరుకునే కుక్షింభరత్వంగా తయారయింది. ఈనాడు మతం, సంఘం, రాజ్యం నిర్జీవ సంస్థలుగా ఒకే సరసను నిలిచి యున్నాయి. పురాతన పుణ్యకాలపు గ్రామ పురోహితుడు (The Village Preacher), గ్రామోపాధ్యాయుడు (Village School Master) ఎంత అమోఘం గా పనిచేసేవారో, 18వ శతాబ్దపు ఆంగ్ల కవిపుంగవుడు గోల్డుస్మిత్ మరపురాకుండ చిత్రించాడు. నేటి దౌర్భాగ్యపు బ్రాహ్మణీకపు వృత్తి కేవలం రూకల సంపాదన కోసం నడుస్తూన్న వాణిజ్యవృత్తి; ప్రజల అజ్ఞానాన్ని ఊతగా చేసుకొన్న రాజకీయపు రొంపి, దేశాన్ని నవ్వుల పాలుగా, దుఃఖభాజనంగా చేస్తున్నది. అప్పుడే మొదలు పెట్టాడట అమెరికా ప్రెసిడెంటు ఓట్ల మేత కోసం ప్రయత్నాలు. ఇండియాలోని రాజకీయులు ఏమాత్రం తీసిపోలేదు.

## పల్లయ్య ప్రైవేట్ స్కూలు

రెండో తరగతికి వచ్చానో లేదో, ఎటునుండి వచ్చి పడ్డాడో, దివాకార్ల పల్లయ్య శాస్త్రులు. మాకు యింగ్లీషు బోధించడానికి మా పెద్దలు, ఈ పిప్పర ప్రాంతపు మనిషిని, ఉంగుటూరుకు రప్పించారు. పల్లయ్య ప్రైవేటు స్కూల్లో సుమారు 15 మంది వచ్చి చేరారు. తన చేతిలో ఏదుంటే దానితో మర్దించి, తొడపాశాలు పెట్టి, మా నోళ్ల అరిగిపోయేటట్లు పాఠాలు అనిపించి వ్రాయించేవాడు. ఆ కాఠిన్యం మాకు ఉపయోగించిందనే చెప్పాలి. పిల్లలందరికి పల్లయ్యంటే సింహస్వప్నం. ఒక సింహంకాదు, పది సింహాలు. వెధవల్లారా, చంపేస్తానసే వాడు. మా అందరికి తలో పేరు పెట్టి (ఎక్కడనుండి తెచ్చాడో ఆ పేర్లన్నీ) ఆ పేరుతో పిలిస్తేనే మేము పలకాలి. అక్కల్‌దాస్, నక్కల్‌దాస్, సుల్వాన్, రాజారసాలు, కుక్కల్‌దాస్, బావాజీ, మండియా, టండియా బైకల్‌బాత్, అలెగ్జాండర్, కళావతి - ఈ విధంగా వుండేవి మా పేర్లు. ఇవి 80 యేండ్లనాటి మాటలైనా, ఆ నాడు మా మనస్సుల్లో జీర్ణించినవి కనుక కొన్ని జ్ఞాపకమున్నాయి. ఈ పేర్ల వాళ్ళందరూ, చిన్నప్పుడే కొందరూ పెద్దలై కొందరూ స్వర్గస్థులైనార నేనొక్కణ్ణి తప్ప. కళావతి పేరు మద్దుల అమ్మన్నకు (కోమటి కుర్రాడు) దక్కింది. అమ్మన్న మరీ నల్లగా ఉండేవాడు కనుక పల్లయ్య మాస్టరు వాడికా నామకరణం చేసి యుంటాడు. చివరి రోజుల్లో ఏదోవూరు నుండి ఒకడువచ్చి కొద్దినెలలు బళ్లో వున్నాడు. ఏలనో కాని పంగనామాల

బోడివెధవ' అని పల్లయ్య వాడికిచ్చిన పేరు. బాల్యంలో నాకు దగ్గరనేస్తం పెంటపాటి సుబ్బయ్య ('మండియా'). మా యిద్దరి స్నేహ సమాచారం చెప్పుకుంటే ఒక కథే అవుతుంది. మా యిద్దరివి బ్రాహ్మణవీధి మంచినీటి చెఱువు గట్టు యిళ్లు. ఆ గట్టు పొడుగునా ఒక వైపు పెద్దవైన రావిచెట్లు, గ్రామరక్షకు లన్నట్లుండేవి.

ఆ చెట్ల క్రిందను వాటిచుట్టూను సుబ్బయ్యా నేను ఆటలాడేవారము. చెట్ల మీద స్వేచ్ఛగా రకరకాల పక్షులు - చిలుక, గోరువంక, కాకి, కోవెల మున్నగునవి వీధియంతా ధ్వనించేలాగున కూస్తూండేవి. ముఖ్యంగా వేసవి రోజుల్లో ఉదయం పూట మా తండ్రి తనతో పాటు నన్ను చెఱువుకు తీసుకునివెళ్ళి బిందెడు నీళ్లు జువ్విచెట్టు క్రింద పెట్టి నాకు కంఠస్నానం చేయించి, నన్నింటికి తోలివేసి, తరువాత తాను స్నానం చేసి వచ్చేవాడు. నేను హుషారుగా కుడిచెయ్యి ఎగురవేసి రొండుగా తిప్పుకుంటూ యింటికి పరుగెత్తేవాణ్ణి. సుబ్బయ్యా, నేను ఒకే వయసు వాళ్లం. తాటాకుకు తాడుకట్టి (అదే మాబండి) ఒకడు కూర్చోడం, రెండోవాడు లాగడం - అది బాల్యక్రీడ. మా అవస్థను చూచి మామిడి చెక్కల చక్రాలతో ఒక చిన్న తొట్టి చేయించాడు మా తండ్రి. మా యిళ్లు ఊరు చివరనుండటం వల్ల ఆ ఖాళీ ప్రదేశంలో మా యిద్దరికే బాగా ఉపయోగపడ్డది

ఆ బండి. వెలువుగట్టున ఒక చివర తాటిచెట్టును మించి ఎత్తయిన ఈత చెట్టొకటుండేది. తెల్లవారి లేవగానే సుబ్బయ్య, నేను (వేసవిలో) ఆ చెట్టు కింద చేరేవాళ్లం. మాకంటె ముందు చెట్టు మీదకి తయారయ్యేవి కాకులు. మేము అడుక్కుంటే, కొన్నిపండ్లు కిందికి రాల్చేవి కాకమ్మలు - ఆ పండ్లు ఖర్జూరాలంత పెద్దవిగా ఉండేవి. అమృతోపమానంగా కొన్ని తిని, కొన్ని యింటికి తెచ్చుకొనే వాళ్ళం. ప్రక్కనున్న నీటిబోదెలో, మెత్తని ఒంగ్రుమన్ను తీసి, అగ్గిపెట్టె చట్రా లతో యిటుకలుతీసి, ఎండబెట్టి ఇంటికి తెచ్చి వాటితో యిళ్లో గుళ్లో కట్టేవాళ్లం. వర్షం రాగానే అవి కూలిపోయేవి. పల్లయ్య స్కూల్లో బాగా దెబ్బలు తిన్న వాళ్ళలో సుబ్బయ్య ఒకడు. వీధిబడి చదువంతా అయి మేము పెద్దవాళ్ళమైన తరువాత పాత శిష్యుల్ని చూచి పోవడానికి పల్లయ్య ఉంగుటూరు వచ్చినట్లు సుబ్బయ్య నాకు చెప్పాడు. మేము కొందరం పై చదువులకని పట్టణాలకు పోయినాము. అప్పటికి పల్లయ్య మీది భయం తీరి సుబ్బయ్య అన్నాడట : 'మీరు పెట్టిన తొడపాశాలతో చర్మం కందిపోయిం దండి' అని. 'అవునురా మరి - దెబ్బలు పడకపోతే చదువెల్లా వస్తుంది ?' అన్నాడట పల్లయ్య. సుబ్బయ్యకు స్కూలు దెబ్బల బెదరు తీరింది కనుక యిద్దరూ నవ్వు కున్నారు. సుబ్బయ్య, తరువాత హరి కథలు నేర్చుకొని, పెద్ద భాగవతార్‌గా రాణించాడు. పల్లయ్యచేత పోతుకూచి సాంబయ్య ('టండియా') తిన్న దెబ్బలు ఇన్నీ అన్నీ కావు. ఒకనాడు దెబ్బలు బాగాతిని బడి విడవగానే కనబడకుండా పారిపోయినాడు. తోటలు, దొడ్లు, కొంత వరకు కాల్వ అవతల నున్న అడవి (Reserve Forest) వెదకినా సాంబయ్య దొరక లేదు. చివరకు, యింటిలో చీకటి మూలనున్న చిటు పొణకలో - ముచ్చ మటలు పోసి మునిగి కూర్చున్నాడు. ఆయాసంతో బుస కొడుతున్నాడట. మర్నాడు పల్లయ్య ఈ కథ విని 'ఓరీ వెధవా, యిక కొట్టనులే' అని బడికి తీసుకొని వెళ్ళాడు.... ఒకనాడు నర సింహాన్ని కొట్టడానికి తాటికమ్మ ఎత్తి పట్టుకున్నాడు పల్లయ్య. ఇంట్లో వంట చేసుకుంటూన్న మా అత్తయ్య (మా తండ్రి అక్కగారు. అప్పటికే ఆమెకు 60 యేండ్లు) అమాంతంగా వీధి అరుగు వద్దకు వచ్చి (ఆ అరుగులే మా బడి) "ఏం పల్లయ్యా, మనిషివా, పశువ్వా ? పిల్లవాణ్ణి చంపేస్తావా యేమిటి ?' అంటూ పల్లయ్యను తిట్ట డం ప్రారంభించింది. 'బాబో, బాబో'! అని యేడుస్తూన్న నరసింహం రొదవిని సూరమ్మగారు బయటికి వచ్చింది. 'లేదమ్మా, ఒంటి మీద దెబ్బపడ కుండానే కమ్మ ఎత్తే సరికే వెధవ యేడుస్తున్నాడు' అని ఆమెకు చెప్పు కున్నాడు పల్లయ్య.

1902 సంవత్సరమంతా పల్లయ్య మాతో వుండి ఎక్కడికో వెళ్ళిపోయాడు. పిప్పర వెళ్లాడేమే ! (ఇంకా వుంది



## 1991 జూన్ 23

పద్మాలయా హనుమంతరావు, ఆంధ్రప్రదేశ్ ఫిలిమ్ ఛాంబర్‌కి అధ్యక్షులుగా ఎన్నికైన సందర్భంగా, మద్రాసు తెలుగు ఫిలిమ్ జర్నలిస్ట్స్ అసోసియేషన్ వారు, యమ్‌యమ్ థియేటర్‌లో పత్రికా గోష్ఠి ఏర్పాటు చేశారు. అసోసియేషన్ అధ్యక్షులు జగదీష్ బాబు, ఉపాధ్యక్షులు శ్రీనివాస్, హనుమంతరావుని అభినందిస్తూ, పద్మాలయ త్రయానికి (హీరో కృష్ణ, హనుమంతరావు, ఆదిశేషగిరిరావు) గల ప్రత్యేకత తెలిపారు. ఉత్సాహవంతులైన కార్యదర్శి జగన్, స్వాగతం పలికి, వందన సమర్పణ గావించారు.... "రా ఫిలిమ్ ధర ఏకపక్ష నిర్ణయంగా ముప్ఫయ్యేడున్నర శాతం పెరిగిన కారణంగా జూన్ 29 వ తేదీ అర్ధరాత్రి నుంచి లాబ్స్‌లో పని నిలిచిపోవచ్చు. డాలరు రేటు లోని వ్యత్యాసం వల్ల ఏర్పడే ధరల పెంపకాన్ని, ఫిలిమ్ పరిశ్రమ కొంతమేర అర్థం చేసుకోగలదు.... 1990 ఆగస్టులో 11% పెంచారు; 1991 జనవరిలో 25%; ఫిబ్రవరిలో నియమించిన కమిషన్‌తో సంప్రదింపుల ఫలితంగా 4 శాతం తగ్గించారు. పదహారు నెలల వ్యవధిలో కేంద్రాన రెండు ప్రభుత్వాలు మారాయి. రెండు రోజుల క్రితం ప్రమాణ స్వీకారం చేసిన నూతన మంత్రివర్గంలో, ఈ శాఖ ఎవరిదవుతుందో వారిని, ఫెడరేషన్ ప్రతినిధులు ఈ బుధవారం కలుసుకుంటారు.. వినోదపు పన్ను ద్వారా రాష్ట్ర ప్రభుత్వానికి వసూలయే మొత్తంలో సాలీనా రెండుకోట్లు చిత్ర పరిశ్రమాభివృద్ధికి కేటాయించి, ఖర్చు చేయాలనే నిబంధన ఉంది. గత ఏడేళ్ళగా ఈ రెండుకోట్ల కేటాయింపు జరుగుతున్నది; అయితే, దానిని నియమిత పద్ధతులలో 'ఎఫ్‌డిసి' ద్వారా ఖర్చు చేయలేకపోవడం వల్ల, సమాచార శాఖకు, తద్వారా జనరల్ ఫండ్‌కి వెళ్ళిపోతున్నది. ఇప్పటికి పధ్నాలుగు కోట్లు ఆ విధంగా వెనక్కి వెళ్ళి పోయింది - వినియోగపరిచే మార్గాలూ లేక! .... 'విడియో పైరసీ' ని కొత్తగా రూపొందిన 'విడియో ఛాంబర్' మాకంటె సమర్థవంతంగా నిరోధించ గలుగుతుంది.

ఏ థియేటర్ యిటువంటి దొంగతనం తో చేతులు కలుపుతున్నదో, మాకు సాక్ష్యాధారంతో తెలిపితే, వెంటనే ఆ థియేటర్‌ని ఫిలిమ్ ఛాంబర్, బ్లాకు లిస్టులో చేరుస్తుంది.... రీ రికార్డింగ్ థియేటర్ అంటే కనీసం కోటీ ఏభై లక్షలు కావాలి. అటువంటి భారీ ప్రయత్నాన్ని రాష్ట్ర ప్రభుత్వం తల పెట్టాలి గాని వ్యక్తుల వల్ల అయే పని కాదు. ఒకప్పుడు కోఆపరేటివ్ సెక్టారులో థియేటర్లు నిర్మించవచ్చు నని అనుకున్నాం - అలాటివి ఈ రంగంలో సానుకూలపడవు. ఫిలిమ్ నగర్ కాలనీ, హైదరాబాదు నగరం లోని రెండువేల హౌసింగ్ కాలనీలలో ఒకటి. ఫిలిమ్ పరిశ్రమాభివృద్ధికి రాష్ట్ర ప్రభుత్వం యితోధికంగా చేయూత నిస్తూనే వుంది" - అన్నారు ఆంధ్రా ఫిలిమ్ ఛాంబర్ అధ్యక్షులు పద్మాలయా హనుమంతరావు. ప్రభు త్వాధికారులు సరిగా సహకరించక అడ్డు పుల్లలు వేస్తారనే మాట నిరా ధారమనీ, బూటకపు ప్రచారమనీ, నియమావళి తెలుసుకు నడవటం మన బాధ్యత అనీ అన్నారాయన. గంట సేపు జరిగిన ఈ గోష్ఠిలో, తెలుసుకో దగ్గ విషయాలెన్నో చెప్పారు హను మంతరావు.

. . . . . 26

గేటు దగ్గరున్న వాచ్‌మాన్‌ని 'అమ్మగారు గాని, అయ్యగారు గాని యింట్లో వున్నారా?' అని అడిగాను - కారు దిగకుండా. 'ఇద్దరూ వున్నారు' అని అతను అంటుండగా, మెట్లమీద నుంచుని, తోటపని వారికి సూచన లిస్తున్న వాణిశ్రీ 'రండి, రండి' - అన్నారు. లోపలికి వెళ్లాను. డ్రాయింగ్ రూమ్‌లో కూచున్నాక, 'కాఫీయా, బటర్‌మిల్కా, కూల్‌డ్రింకా?' అని అడిగారు భార్యాభర్తలిద్దరూ. 'కాఫీయే' - అని చెప్పి, 'మీరీ మధ్య అయిదారు వారాలపాటు విదేశాలకు వెళ్లారట - ఎక్కడెక్కడికి?' - అని అడిగాను .... "ఆ పట్నాలు, పార్కులు, పరిశుభ్రత, పర్యావరణ పరిరక్షణ, ప్రజల సత్ప్రవర్తన యివన్నీ చూస్తూంటే, మనం ఎప్పటి కైనా ఆ స్థితిని అందుకోగలమా అని పించింది .. లండన్‌లో ఉండగా షేక్స్‌పియర్ జన్మస్థలం చూశాము. ఇప్పటికీ అక్కడ ప్రతిరోజూ షేక్స్ పియర్ నాటకం వేస్తూ వుంటారు. అక్కడ ఆ నాటక ప్రదర్శన చూడా లనే ఆసక్తితో, 'మర్చెంట్ ఆఫ్ వెన్నిస్'కి టిక్కట్లు కొన్నాను కూడా. కాని, కారణాంతరాల వల్ల చూడలేక పోయాను.... మ్యూనిక్‌లో ఒలంపిక్స్ జరిగిన ప్రదేశం చూశాము.... స్విట్జ ర్లాండ్ ప్రయాణం మన ప్రమేయం లేకుండానే ఊహాలోకాల విహరింప జేస్తుంది. యూరప్‌లోని కొన్ని దేశాలు మాత్రమే నేనూ, ఆయనా, పిల్లలూ తిరిగి వచ్చాము. పిల్లలకు ప్రతిదీ బోధించి చెప్పేందుకు ప్రయ త్నించేదాన్ని - కొన్ని అర్థమయేవి, కొన్నిటికి తలవూపేవారు. ఇంకో పదేళ్లు పోయాక, మరింత స్పష్టంగా

అవగాహనకొచ్చే ఈ స్మృతులు వారి బాల్య సంపద అవుతాయి.... ఒకప్పుడు చిత్రలేఖనం పట్ల సరదాగా ఉండేది, ఇప్పుడు మానేశాను. పాట తెలిసిన వారు సన్నగా పాడుకోవటంలో గల ఆనందం వంటిదే చిత్రకళలోనూ వుందని నాకు తెలుసు - కాని, అభ్యాసం తప్పిపోయింది. ఇప్పుడెంతకీ చెట్లూ, పూలమొక్కలూను. ఒకసారి పారిజాతం మొక్క నాటాను. పారిజాత మంటే నాకెంతో యిష్టం. పారిజాతాలు యిష్టంలేని వారెవరుంటారు? ఆ మొక్క ఎంతకీ ఎదిగేది కాదు - ఒక సంవత్సరం గడిచింది. ఇన్ని మొక్కలు కలకల నవ్వుతున్నా, ఆ ఒక్కదానికీ నా పట్ల ఎందుకంత కాఠిన్యమో బోధపడేదికాదు. మీరు నమ్మరు, ఒకరోజు దీనంగా అడిగాను: 'ఎందుకమ్మా నామీద అంతకోపం?' అని, చెట్టు మొదట్లో నీళ్లు పోస్తూ. నా పలుకే వినిపించిందో, నా మనసే అవగతమై కనికరించిందో తెలీదుగాని, మర్నాడు పొద్దుట ఒక చిన్న మొగ్గ కనిపించేసరికి, నా సంతోషానికి అవధులు లేవు. అదిప్పుడు బుట్టల కొద్దీ పువ్వులు రాలుస్తోంది; చల్లబాటు వేళ తన చెంత కూచుని కాసెట్ మ్యూజిక్ వినమంటోంది.... రోజూ పొద్దుట, ఇంటి చుట్టూతా వున్న చెట్ల మధ్య తిరిగిరానిదే కాఫీ కూడా ముట్టను" - అన్నారు పూల బాసలూ పూల మనసులూ తెలిసిన ప్రఖ్యాత కళాకారిణి వాణిశ్రీ. దేవుడు మొదటి తోట నాటాడు గనుకనే

## ముఖచిత్రం



ఆంగ్ల అక్షరమాల ప్రకారం ప్రథమ స్థానానున్న ఆంధ్రప్రదేశ్, ప్రధానిని ఢిల్లీ పీఠంపై కూచోపెట్టగలగడం ఒక అపూర్వ గౌరవం. నలభైనాలుగేళ్ల భారత స్వాతంత్ర్య చరిత్రలో, ఒక మురార్జీ దేశాయ్ తప్ప మిగతా అందరూ అత్యధిక ప్రాతినిధ్యం గల ఉత్తరప్రదేశ్ నుంచి వచ్చిన వారే! కొద్ది రోజుల క్రితం దాకా 'పివి' వంటి 'స్కాలర్ - స్టేట్స్‌మన్'కి ఈ అత్యున్నతస్థానం సాధ్యమా అని చాలామంది సందేహించారు. అయితే, మధ్యేమార్గాన పయనించే మహాసంస్థ కాంగ్రెస్, తన ఐక్యతను, విజ్ఞతను లోకానికి మరొకసారి చాటిచెప్పింది. కాంగ్రెస్ కేవలం రాజకీయ పార్టియే కాదు - ఈ దేశ ప్రజల స్వప్నాలకు ప్రతిరూపం.... కరీమ్‌నగర్ జిల్లా వంగర గ్రామంలో, సంప్రదాయం కుటుంబంలో జన్మించిన పాములపర్తి వెంకట నరసింహారావు కాంగ్రెస్ నాయకులలో కడు నిదానస్తులు, వజ్ర సంకల్పులు. ఫ్రెంచి, స్పానిష్‌లతో బాటు పన్నెండు భాషలు తెలిసిన సాహితీ రత్న. రాష్ట్ర మంత్రిగా, ముఖ్య మంత్రిగా, కేంద్రంలో వివిధ శాఖల సీనియర్ మంత్రిగా పదవీ బాధ్యతలు నిర్వహించిన పివి నరసింహారావు,తాము నమ్మిన సిద్ధాంతాలకు త్రికరణ శుద్ధిగా కట్టుబడి నడుచుకొనే నిర్వివాద వ్యక్తి, నిశ్చల చిత్తులు, అనుపమ సౌజన్యమూర్తి.

తోటపనిలో అంతటి నిర్మలమైన ఆనందం ఉంది - అని, ఫ్రాన్సిస్ బేకన్ చెప్పినది గుర్తుకొచ్చింది. ముప్ఫయి నలభై ఏళ్లనాటి పుస్తకం I leap over the Wall లోని కథా నాయిక, గార్డెనింగ్‌లో ఎటువంటి దివ్యానుభూతినీ పొందినదీ చెప్పాను. మాటల సందర్భంగా ఎల్లన్ శర్మ, శారదాంబకు మొక్కలపై గల ఆపేక్ష, మా కిచెన్ గార్డెన్, కాక్‌టైల్, బోన్‌సాయ్ యిలాటివనేకం రావడంతో 'ఆగస్టులో మీరు ముగ్గురూ ఒక సాయింత్రంపూట మా గార్డెన్ చూడ టానికి రావాలి' అన్నారు.... కొందరి తో మాట్లాడుతున్నప్పుడు టైము పరుగెత్తడం తెలీదు - ఇవ్వాళా అంతే!

. . . . . 27

నిన్నరాత్రి, అనగా ప్రజోత్పత్తి నామ సం॥ర జ్యేష్ఠ శుద్ధ పూర్ణిమా బుధవారము రాత్రి 11 గం॥ 51 ని॥ లకు, మూలా నక్షత్ర యుక్త మీన లగ్న పుష్కరాంశయందు, సినీహీరో ఘట్టమనేని కృష్ణ, ఇందిరాదేవీల ప్రథమ పుత్రిక సౌ॥ పద్మావతికి, తిరుపతి వాస్తవ్యులు గల్లా రామ చంద్ర నాయుడు దంపతుల కుమా రుడు, రాజగోపాల నాయుడు మను మడు చి॥ జయదేవ్‌కు, విజయ శేష్ మహల్‌లో వైభవంగా వివాహం జరి గింది.... తమిళనాడు గవర్నర్ భీష్మ నారాయణ్ సింగ్, పద్మవిభూషణ్ యన్ జి రంగా, ఆంధ్ర తమిళనాడు మంత్రులూ, సినీ ఫీల్డ్‌లోని ముఖ్యులూ, అనేక మంది కాంగ్రెస్‌వారూ వధూ వరులను ఆశీర్వదించారు.

. . . . . 29

'తెలుగు తమిళభాషల్లోని జానపద సాహిత్యం' గురించి, పొట్టి శ్రీ రాములు హాలులో, అభ్యుదయ రచ యితల సంఘ వేదిక మీద, భారతీ కాలేజీలోని తెలుగు శాఖకు ప్రధాన అధ్యాపకురాలైన, నిర్మలా పళనివేలు మాట్లాడారు.... కనక దుర్గ స్వాగత వచనం పలికి, కృతజ్ఞతా నివేదన తెలుపగా, ప్రొఫెసరు కృష్ణమూర్తి, ప్రధాన వక్తను పరిచయంచేసి, అధ్య క్షత వహించారు.... "జనపదంలో నివసించే జానపదుల పని పాటలలోని లయాత్మక ధ్వని జానపద సాహిత్య మయింది. పనిలోని అలుపు, పాట లోని సొలుపుతో పనిపాట లయాయి సుఖ దుఃఖాలు. సంయోగ వియోగాలు, రాగద్వేషాలు పామరులు వెల్లడించి నంత సూటిగా పట్న వాసులు చెప్పరు. జనపదాలలోని పామరులు మోటుగా కనిపిస్తారు గాని వారు నిష్కపటులు, నిర్మల మనస్కులు. జానపద సాహిత్యానికి రాజాస్థానాలలో ప్రవేశం కలుగలేదు ; అయితే దానికి గల ప్రజా సంపర్కాన్ని, ప్రజా జీవిత సమరం నుంచి జనించిన చేతనను ఎవరూ కాదన లేరు. వాగ్రూపం దాల్చిన మీదటనే పరిశోధన ప్రారంభ మయింది. Folk అనే మాటకు ఒక ప్పుడు నిరక్షరకుక్షి అని అర్థం చెప్పు

కొనేవారు. తరవాత్తరవాత 'తరతరాల ప్రజ'గా అర్థం చెప్పుకున్నారు - (పండిత మండలికి భిన్నమైన సామాన్య ప్రజావళి) .... పచ్చటి పొలం, చల్లని గాలి, వెన్నెల కాంతి ఎటువంటి రసస్ఫోరకమో ఈ జానపద సాహిత్యమూ అంటే! .... 'ఏడవకు ఏడవకు వెర్రి నా పాపాయీ, ఏడిస్తే నీ కళ్ల నీలాలు గారు, నీలాలు కారితే నే చూడలేను, పాలైన గారవే బంగారు కళ్లు' .... ఏడ్చే పాపని వూరుకో బెట్టడంలోని మాతృ హృదయ స్పందన ఆ రచనాల్లో కనిపిస్తుంది. ఎన్నివందల ఏళ్లుగా ఎన్ని కోట్ల మంది తల్లులు పాడారో ఈ పాట .... తమిళంలోనూ వుంది ఈ వరవడిలోనిది. మనకు తెలిసిన తెలుగు, ఆరవ శతాబ్దిలో శిలాశాసన రూపం దాల్చి, పదకొండో శతాబ్దితో (ఆది కవి నన్నయ్య మహాభారతం) గ్రంథస్థమయింది. తెలుగూ తమిళం రెండూ ద్రావిడభాషా సంతతివే అయినప్పటికీ, తమిళం, తెలుగు కంటే ఎంతో ప్రాచీనమైనది. క్రీస్తుకి పూర్వపుదైన సంగకాల సాహిత్యం అనాటి ప్రజాజీవిత దర్పణం. నన్నయ వాడిన తరువోజ, మధ్యాక్కర జానపద సాహిత్యానికి చేరువైనవి. నన్నెచోడుడు రోకటిపాట గురించీ, పాల్కురికి సోమనాథుడు వెన్నెల పాటలు గురించీ ప్రస్తావించారు.... వలయాకరంగా నిలబడి ఏడుస్తూ, మృతులైన వారి గుణగణాలు శ్లాఘిస్తూ పాడే 'ఒప్పారి

పాటలు' తమిళనాడులో నేటికీ ప్రజాదరణ పొందుతున్నాయి. మృత శరీరాలవద్ద ఏడ్చే బృందాలను పిలిపించి, వారి చేత పెద్దగా విలపింపజేయడం, శ్మశాన వాటికకు మృత శరీరాన్ని ఒక సంబరంలా తీసుకు వెళ్లడం యిప్పటి మనకి కనిపిస్తుంది. చని పోయిన వారి ఆత్మశాంతి కోసమ దంతా! .... శిశువు మరణిస్తే, తల్లి గుండెలు బాదుకుంటూ 'మారడిపు' పాట పాడుతుంది, 'ఇంత అందాన్ని యిచ్చి, ఆయుస్సు పోయడం మర్చి పోయావా, విధాతా!' అని సృష్టికర్తను నిందిస్తూ .... 'ఒప్పారి పాటలు' చిత్తూరు జిల్లాలో ఉన్నాయని ఆ మధ్య నొకరు చెప్పారు. అది తమిళ భాషా ప్రభావమో, తెలుగులో కూడా వున్నాయో, నేనింకా పరిశీలించ లేదు .... పద కవితలు, యక్షగానాలు విద్వజ్జనుల గౌరవం పొందాయి. కాని, వేటపాటలు, కపిలపదాలు, ఏతాంపాటలు, కుప్పనూర్పిడి పాటలు - యిలాటివి జానపద సాహిత్యంగానే చెలామణీ అవుతున్నాయి. ఈ వరి కుప్ప నూర్చేందుకు ఎడ్లు చాలవు ఏనుగులు తెప్పించాలి - అన్నాడట ఒక జానపద కవి.... సంపన్నులను దోచి, పేదలకు పంచిపెట్టే రాబిన్ హుడ్ వంటి పాత్ర తమిళ జానపద సాహిత్యంలో ఉంది - అతని పేరు జంబులింగం మనకు పోచమ్మ, ముత్యాలమ్మ గ్రామదేవత లైనట్లే, వారికి మారియమ్మ (వర్షం కురిపించే దేవత - మారి అనగా వర్షం). కన్నగియే మారియమ్మ, ముత్తుమారి అని, కథలు వున్నాయి.... 'ఏలేలా - హైలాసా' పడవ పాట లోని, 'ఏలేలా' తిరువళ్లువార్ కాలంతో ముడివేస్తారు.... జానపద సాహిత్యం లో అశ్లీలమూ, మలిన శృంగారమూ లేకపోలేదు. అయితే, దానిని మనో వైజ్ఞానిక విశ్లేషణతో చూడవలసి వుంది.... అత్త లేని కోడలు ఉత్తము రాలు, కోడలు లేని అత్త గుణవంతు రాలు వంటి అత్తా కోడళ్ల కయ్యాలు తమిళ జానపద సాహిత్యంలోనూ వున్నాయి .... దంపుళ్ల పాటలు, తలుపు దగ్గిర పాటలు, ఇలా ఎన్నో! .... 'లల్లబీ' లాలిపాట అయింది. 'జో అచ్యుతానంద జోజోముకుందా .... తొలుత బ్రహ్మాండంబు తొట్టె గావించి, నాలుగు వేదాలు గొలుసు లమరించి' (అన్నమయ్య) అని వుయ్యాలవూపుతూ శిశువుని నిద్రపుచ్చే తల్లి, ఆ లాలిపాటలో ఆ పద చిత్రణలో సృష్టి లీలా విలాసంలో తన్మయురాలవుతుంది.... శిష్టమైనా, జానపదమైనా సాహిత్య ప్రయోజనం మానసికోల్లాసం" - అని సుమారొక గంటసేపు, సరళంగాను స్పష్టంగా, చక్కటి పదజాలంతో, క్రమాను గతంగా వివరించి చెప్పారు డా॥ నిర్మల పళనివేలు.

—యన్నార్ చందూర్

# కొత్త పుస్తకాలు

'కామ్రేడ్ భగత్‌సింగ్' - రచన: కె ప్రతాపరెడ్డి. ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు-500 001.... వెల: రు 20-00.

(ఈ పుస్తకం మొదటి ముద్రణ 1983 మార్చిలో, రెండవ ముద్రణ 1984 లో ; ఇది 1990 మే నెల మూడవ ముద్రణ)

గదర్ వీరుడు కర్తార్ సింగ్‌ని ఉరి తీసే నాటికి భగత్‌సింగ్ ఎనిమిదేళ్ల బాలుడు. జలియన్‌వాలా బాగ్‌లో ఆగి, రక్తసిక్తమైన పవిత్ర మృత్తిక సీసాలో భద్ర పరిచిననాడే, అతని భవిష్యత్తు ఒకవిధంగా నిర్ణయమైపోయింది. దైవచింతనగల కుటుంబంలోని యువకునికి, అంతటి కసీ, తెగింపూ ఎందుకు కలిగాయో ప్రపంచాగ్నికి తాను ఒక సమిధనపు తానని తెలిసి కూడా అది తన బాధ్యతగా కర్తవ్యంగా ఎందువల్ల భావించాడో, భగత్‌సింగ్ కాలంనాటి చరిత్ర తెలుసుకుంటేగాని బోధపడదు.

1913 లో వివిధ దేశాలకు చెందిన భారతీయులు స్టాక్‌హోమ్‌లో సమావేశమయారు. 1905 నుంచీ భారత దేశంలో అలజడి - టెర్రరిస్టు ఉద్యమం - దేశం వెలుపల గదర్ పార్టీ - 1914 సెప్టెంబరులో గదర్ వీరులు వున్న జపాన్ ఓడ కలకత్తా తీరం చేరగానే, బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం 'రాజవిద్రోహులు'గా ఆ పార్టీ సభ్యులందరినీ అరెస్టు చేసి, కొందరిని అండమాన్‌లో వుంచింది. మొదటి ప్రపంచ యుద్ధకాలం. ఈ యుద్ధం నుంచి రష్యా విరమించుకునేటట్టు జేసే వొప్పందం మీద, జర్మన్ ప్రభుత్వం 1916 లో బెర్లిన్ నుంచి సీల్‌డ్ ట్రయిన్‌లో లెనిన్‌ని పెట్రోగ్రాడ్ పంపింది – ఆ నాటి రష్యాకు రాజధానీ నగరమదే! నౌకా బలం తిరుగుబాటు, యుద్ధ విరమణ, లెనిన్ నాయకత్వం, విప్లవజ్వాలలలో జార్ వంశనిర్మూలన, సామ్యవాద ప్రభుత్వ స్థాపన టకటకా జరిగాయి. పది రోజులపాటు యావత్ప్రపంచం గడగడలాడింది (టెన్ డేస్ దట్ షుక్ ది వరల్డ్ - జాన్‌రీడ్), సర్వమానవాళికి రష్యా ఒక అరుణతారై నిలిచింది. జవహర్‌లాల్ నెహ్రూగాని, జార్జి బెర్నార్డ్‌షా గాని అందరూ ఆ నవ సమాజోద్భవాన్ని అభినందించిన వారే! వివిధ రకాల దోపిడీలనుంచి



"In spite of Rama being an incarnation of God, why that fight with Ravana took seven long days? In the earlier instances of Varaha, Narasimha and Vamana, He did the job quite briskly," asked Raghu.

"True. But Parasurama had to make twentyone conquests to show the arrogant rulers their appropriate place. It spread over several years," said Raghu's Father.

"Rama was endowed with all the heavenly gifts and earthly skills but still he took seven days to finish the enemy."

"What was wrong in it? Being born into a royal family, he should behave like a prince. Having assumed a mortal frame, he should behave like all mortals. Bound by the precepts of Dharma, when treachery took place in the garb of might, he should punish the wrong-doer, establish the supremacy of Dharma - judicious Law and Order. He wanted the world to watch for seven days how powerful and dangerous the insolent might could be. Even God in His eternal wisdom would not stoop to magic formula - everything has to evolve to a fruition."





సామాన్య మానవుని ఆదుకోగలిగిన దదొక్కటే అని అందరూ అన్నారు.

మన దేశీయ వాతావరణంలో లాల్, పాల్, బాల్, త్రయం (లాలా లజపతిరాయ్ - పంజాబ్; బిపిన్ చంద్రపాల్ - బెంగాల్ ; బాలగంగాధర తిలక్ - మహారాష్ట్ర) దేశప్రజ తరఫున మాట్లాడే మహానాయకులు ; ప్రభుత్వ దృష్టిలో వీరు అతివాదులు, గోఖలే మితవాది. గాంధీజీ దక్షిణాఫ్రికా నుంచి వచ్చారు - ఆయన సత్యాగ్రహ పోరాట విధానం ఆంగ్ల పాలకులకి తెలుసు. గోఖలే, తర్వాత తిలక్ పరమపదించడంతో, గాంధీగారు జాతీయోద్యమానికి ముఖ్య నాయకులయారు. అహింస ఆయన వజ్రాయుధ్ధం.

క్రౌర్యానికి తలవంచి ప్రయోజనం లేదు, ధీరత్వంలో ఎదుర్కోవాలి - అనేది హిందూస్థాన్. సోషలిస్ట్ రిపబ్లికన్ అసోసియేషన్ భగత్ సింగ్ ఆ పార్టీలో ప్రముఖ సభ్యుడు. 'చెవిటివానికి వినిపించేందుకు ఘట్టిగా అరవవలసివస్తుంది. ఒక వ్యక్తిని చంపినంత మాత్రాన వ్యవస్థ మారదని మాకు తెలుసు. సూచన ప్రాయంగానైనా మా ఆగ్రహమూ ఆత్మక్లేశమూ తెలుపక పోతే, మేము చేతకాని వాళ్లమనుకుంటున్నారు,' అని భగత్ సింగ్ ప్రభృతుల ధోరణి.

1928 అక్టోబరు 30వ తేదీన సైమన్ కమీషన్ లాహోరు వచ్చింది. నల్లజండాలతో, వ్యతిరేక ప్రదర్శనకు ముందు వరసలో, లాలా లజపతిరాయ్, మదన మోహన్ మాలవ్యా ఉన్నారు. లజపతిరాయ్ అప్పటికే గాంధేయవాది. గాంధీజీ పిలుపు ననుసరించే ఈ వ్యతిరేక ప్రదర్శన. లజపతిరాయ్‌ని ఆరోజున ఎంతదారుణంగా లాఠీలతో మోదారంటే, నవంబరు పదిహేడున ఆ దెబ్బల కారణంగా ఆయన మరణించాడు. యువకులకు రక్తం వుడికిపోయింది. ఈ కిరాతక చర్యకు ప్రతీకారంగా, ముఖ్యుడైన పోలీసాఫీసరు ప్రాణాలు తీయడమే, లజపతిరాయ్ ఆత్మకు శాంతి - అనుకున్నారు. వారి కోపం సిబ్బంది మీద కాదు - ఉత్తరువు జారీ చేసిన అధికారిమీద .... భగత్ సింగ్, అజాద్, రాజగురు, జయగోపాల్ - ఈ నలుగురూ 1928 డిసెంబరు 17వ తేదీన పోలీసు కార్యాలయం సమీపాన కాచుకొని వున్నారు. వారు చంపదలచుకున్నది స్కాట్‌ని – ఆ సమయాన వెలుపలికి రావాల్సిన స్కాట్ బదులు సాండర్స్ వచ్చాడు. జయగోపాల్ సైగ చేయగా మొదట రాజగురు పేల్చాడు, ఆ తర్వాత భగత్ సింగ్ పేల్చాడు. సాండర్స్ చనిపోయాడు. ఆ రాత్రికి రాత్రే లాహోర్ నుంచి మారువేషాలలో పారిపోయి కలకత్తాలో తేలారు ప్రతీకార యోధులు.

ఫ్రెంచి శాసన సభలో ఒక ధైర్యశాలి బాంబు విసరడం, దానిని అపడా

వికి ప్రయత్నించిన ఒక స్త్రీ, ఆమెతో బాటు మరికొందరూ గాయపడటం, భగత్‌సింగ్ చదివివున్నాడు. 1929 ఏప్రిల్ 8వ తేదీన ఢిల్లీలోని కేంద్ర శాసన సభలో భగత్‌సింగ్, బట్‌కేశ్వర దత్ చెరో బాంబు విసిరి, సభ్యులను భయభ్రాంతులు గావిస్తూ, ఆ శబ్దమూ పొగలో తమ ఆశయమూ లక్ష్యమూ వివరించే కరపత్రాలు వెదజల్లారు. తెల్లవారికి గాని, భారతీయ సభ్యులకు గాని ఎటువంటి గాయాలూ తగల్లేదు. విఠల్‌బాయి పటేల్, మోతీలాల్ నెహ్రూ, మదన్ మోహన్ మాలవ్యా, మహమ్మద్ అలీ జిన్నా ఆ నాటి సభలో ఉన్నారు. భగత్‌సింగ్‌నీ, బట్‌కేశ్వర్ దత్తునీ వెంటనే అక్కడి కక్కడే పట్టుకున్నారు.

1931 మార్చి 5వ తేదీన గాంధీ ఇర్విన్ ఒడంబడిక జరిగింది - శాంతి యుత సత్యాగ్రహుల విడుదల, శాసనోల్లంఘన ఉద్యమ విరమణ. హింసావాదుల పక్షాన షరతు పెట్టే నైతికహక్కు తనకు లేదన్నాడు గాంధీజీ. 1931 మార్చి 23వ తేదీన భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్ లను ఉరికంబ మెక్కించారు.

ఎన్నెన్ని కుట్రకేసులు పెట్టినదీ, ఎందరు అజ్ఞాత వీరులు ఈ సాయుధ పోరాటాలలో మరణించినదీ, దేశ మాతను దాస్య శృంఖలాల నుంచి తప్పించేందుకు వారు ఎలా నేల కొరిగినదీ, చారిత్రకాంశాలతో మనసుని ద్రవింపజేసేటట్టు చెప్పారు రచయిత ప్రతాపరెడ్డి.

—క్షీరసాగరమ్

✠ ✠ ✠

'దు న్న' - కథల సంపుటి. రచన : బోయ జంగయ్య, ప్రచురణ : సాహితీ మిత్రులు, నల్లగొండ - 508 001 .... వెల : రు 15-00.

1990 ఆగస్టులో మొదటి ముద్రణ, అక్టోబరులో రెండవ ముద్రణ పొందిన ఈ కథా సంపుటికి పరిచయ వాక్యాలు రాస్తూ, 'తెలంగాణా గ్రామీణ వ్యవస్థ, సమస్తమైన దాని లక్షణాలతో, అందులో జీవించే దున్నలతో, గొర్రెలతో, నక్కలతో, తోడేళ్లతో ఈయన కథలు దర్శన మిస్తాయి' - అన్నారు ప్రముఖ రచయిత డి రామలింగం.

అమ్మవారికి కోపమొస్తే ఊరికి ఆపద సంభవిస్తుందని ఊళ్లో ప్రజని నమ్మించిన కర్ణపోడు రాంగ్‌రావు (రంగారావు) తహసీల్ ఆఫీసులో పిల్లి, ఊళ్లో పులి అయినా, ఒక నాటికి అతని పాపం పండుతుంది. పంది మాంసం తినిపించి, పాతికేళ్ల పరువం తో మత్తెక్కించిన పడతి, 'సినగని వస్త్రం యిప్పించమని' కోరగా, పోరంబోకు భూమి ఆమె పేర్న రాయడంతో (మస్కూరికి యిస్తా నన్నది) తార్పుడుగాడైన ఆ నమ్మిన బంటు, అదను చూసి కరణం కొంప ముంచుతాడు. కరణీకాల రద్దు, విలేజి ఆఫీసర్ల నియామకంతో, చచ్చుబడ్డ

దున్నపోతూ, పలకరించేవారు లేని కరణమూ ఒకేస్థాయిలో ఉండటాన్ని కథకులు ఎంతో రమ్యంగా, హృద్యంగా, వాస్తవికంగా చిత్రించారు.

మయూరిని తప్పుబట్టడానికి వచ్చిన మహిళలు, ఆమె శృంగార లీలలు పొంచి నుంచుని విని మానసికానందం పొంది, సూటిగా ఆమె విసిరిన బాణాలకు బిత్తరపోయిన కారణంగా, ఆ సాయంత్రం 'మయూరి'కే మల్లెపూలు దొరకక పోవడం అల్లరిగా వున్నప్పటికీ రసోద్దీపకం.

'కూతురు కాలికి మన్నంటకుండా బతకాలి కానీ కోడలు మూటలతో రావాలి : అందరికీ చాకిరీ చేయాలి'- ఈ మనస్తత్వ నిరూపణ 'వాయిదా పడిన కేసు'

నిజం, పోస్టుమార్టం, బతుకు పాట, అవసరం - ఈ నాలుగూ సామాన్యమైన రచనలు. హాయిగా చదివింపజేస్తాయి గాని మనసుపై గట్టిగా ముద్రవేయవు. నా పేరు రాయొద్దు, మబ్బులు, వైకుంఠపాళీ - యివి మాత్రం సీరియస్ కథానికలు ; జీవిత శకలాల్ని పాఠకుని ముందు వుంచుతాయి.

శిరీష (నా పేరు రాయొద్దు) తన కూతురికి కాన్వెంట్‌లో సీటు కోరు







కుంటున్నదా? లేక, ఆ పిల్లకు తండ్రీ, తనకు రక్షణ నిచ్చే పురుషుడూ కావాలని కోరుకుంటు న్నదా? ఆ సంవత్సరం సీటు లేక పోతే మరుసటి సంవత్సరానికి అడ్మి షన్ ఫారమ్ యివ్వడం, నీటి కొట్టుకొచ్చే ఎర్రమందారం లాటి 'మారుతి'లో వచ్చిన సెక్రటరీ బ్లాంక్ చెక్ యివ్వడం, ఇద్దరు పిల్లల తండ్రి అయిన మురళి వద్దకు వెళ్లి 'నా హృదయాన్ని అడిగిన వాళ్లందర్కీ, అంగుళం చోటు లేకుండా పరిచాను' అని చెప్పుకోవడం - యిలాటివి సందర్భోచితంగా లేవు; స్వభావ న్యాయానికి లోబడవు.

'మబ్బులు' లోని రాధాబాయి తన వొంపు సొంపులతో లోకాన్ని జయించుకొస్తున్నది; పరిధిలోకి వచ్చిన పురుష ప్రపంచాన్ని మెప్పించి పబ్బం గడుపుకుంటున్నది - బాగానే ఉంది. కాని, వారం రోజుల తర్వాత పడనున్న వర్షం గురించి వాతావరణ పరిశీలన శాఖ డైరక్టరు వద్ద నుంచి ముందే తెలుసుకు, అమ్మవారి ముందు రాత్రివేళ స్త్రీలు దిగంబరంగా నృత్యం చేయడం వల్ల వర్షం పడిందని గ్రామీణులని నమ్మింప బూనడం, కథకు కావల్సిన కొస మెరుపుగా బావుంది గాని గ్రామీణ నైజానికి విరుద్ధం.

వెంకట్రామయ్య ఢిల్లీ వెళ్లి, తన కొడుకు శ్రీనివాసరావు కుటుంబ పరిస్థితులు తెలుసుకు విస్తుపోతాడు. ఈ కారులూ, క్లబ్బులూ, విడియోలు హైహైలు ఎటువంటి డొలకో, ఎంతటి సారహీనమో స్వయంగా తెలుసుకు, 'అది యిల్లా?' అని ఆశ్చర్యపోయి, వెళ్తున్నట్టు కూడా ఎవరికీ చెప్పాలని పించక, వెనక్కి వరంగల్ వచ్చేస్తాడు (వైకుంఠపాళి). మనసుని కదిపే మంచి కథ.

సీతాకోక చిలుక మందారపు పూరేకుల్లో యిమిడిపోవటం, మాట్లా డితే పూలు చల్లినట్లు వుండటం, దగ్గర అవుతున్న నగరం అరణ్యంలా కనిపించటం, చూపులు మత్తెక్కించే మంత్రాలు, మనుషుల కంటె పక్షులే నయం, నూద్దాం అనకుండ్రి - సేస్తర అనండ్రి. ఊరు నిద్ర లేస్తున్న చప్పుడు, - యిటువంటి ప్రయోగాలు కథకునిలోని కవితాత్మకు సూచకాలు.

కథని అల్లడంలో నేర్పు, చెప్పడం లో చాతుర్యం, చదివించడంలో కౌశ లం, యితివృత్తంలో నవ్యత, చిత్రణ లో రసస్ఫూర్తి గల ఉత్తమ కథా రచయిత బోయ జంగయ్య.

—దయానిధి

ఇతరుల బుజాల మీద కెక్కి పై కెగబాకాలనుకునేటంత వరకు, మీ ఆశయాల నెవరూ తప్పుబట్టరు.

—జోసెఫ్ కాన్రాడ్

నేను వర్జీనియా రాష్ట్రవాసిని కాదు – అమెరికన్‌ని.

—1774 లో పాట్రిక్ హెన్రీ

## సమీక్ష

## చిత్రజగతి

శివ శివానీ వారి

### 'మంచిరోజు'

ఉద్యోగం వస్తే గాని పెళ్ళి చేసుకోననే పట్నం వెంకటేష్‌కి (వినోద్ కుమార్), పల్లెటూరి పద్మావతితో (శోభన) పెళ్ళి ఏర్పాటు చేస్తారు. శుభలేఖలు ప్రింటయాక, అతనికి ఉద్యోగం పిలుపు వస్తుంది. ఇవ్వాళ పెళ్ళి, రేపు జాబ్‌లో జాయినవాలి. 'తొందరగా శోభనం చెయ్, నేను మా బామ్మ దగ్గరకెళ్ళి పడుకోవాలి, నిద్దరొస్తోంది' అని పద్మావతి తన భర్తని అడిగినప్పుడు అశ్లీలం ధ్వనించదు సరిగదా అమాయకత్వం కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. జెడలో పువ్వు తుంపి, ఆ రేకులు తలమీద చల్లి, 'యిదే శోభనం' అని అనడంతో, బాధ్యత గల యువకునికి అజ్ఞానవతి అయిన భార్యపట్ల గల సదవగాహన వెల్లడవుతుంది. ఉద్యోగం యివ్వబోతున్న అధికారులు, యింటర్వ్యూలో చెబుతారు : 'నీకు పెళ్ళయిందా? పెళ్ళి అయితే ఈ ఉద్యోగానికి అనర్హుడివి. ఉద్యోగంలో చేరిన సంవత్సరందాకా పెళ్ళి చేసుకోననే బాండు మీద సంతకం పెట్టాలి. ఈ ఉద్యోగ నిర్వహణ తప్ప యితర ధ్యాసలేమీ వుండకూడదనేది మా లక్ష్యం'.... పెళ్ళి కాలేదనే అబద్ధంతో, బాండు మీద సంతకం పెట్టి, ఆఫీసువారు ఏర్పరిచిన 'బాచులర్స్ క్వార్టర్స్'లో ఉంటూ ఉంటాడు వెంకటేష్. అసలీ పూర్వగాథ అంతా. మహా తమాషాగా వెల్లడిస్తారు దర్శకులు మౌళి. ఇరుగు పొరుగు యిళ్ళలో వున్న యువతీ యువకుల ప్రణయ గాథ, అతను వెంటబడటం ఆమె చీదరించుకోవటం, ఆమె విరాకు పడిన కొద్దీ అతను బంకలా పట్టుకోవడం, వివరికతనిని పోలీసులు పట్టుకు పోగా, ఆమె పోలీసుస్టేషను కొచ్చి, సదరు పెద్దమనిషి తన భర్త అని చెప్పి విడిపించటంతో, సస్పెన్స్ ముగిసి, పూర్వ రంగంపై తెర పడుతుంది.... భర్తను వెతుక్కుంటూ పట్నం వచ్చిన అమ్మాయి, బాచులర్స్ క్వార్టర్స్‌లో, వెంకటేష్ కజిన్‌గా నడుచుకుంటుంది గాని పరిస్థితి శృతి మించి అంతా రసాభాస అవుతుంది. కలతలు, కన్నీళ్ళ తర్వాత 'మంచి రోజు' ఆ నవదంపతులకి. హాస్య రస వాహినితో ప్రేక్షకులని మెప్పించే ఈ చిత్రానికి నిర్మాత : శ్రీనాథ్.





1991 ఫిలిమ్ ఫెస్టివల్ విశేష సంచిక బాగుందని ప్రశంసిస్తూ అభినందన లేఖలు వ్రాసిన పాఠక మిత్రులందరకు మా కృతజ్ఞతాంజలి.

తమకొక కాపీ కావాలంటూ కార్డులూ కవరులూ వ్రాసిన వారికి, కాపీలు లేవనీ లభ్యం కావనీ వినయపూర్వకం తెలియజేస్తున్నాము.

పరిమిత సంఖ్యలో ప్రింటయే పత్రిక ఈ 'జగతి' - విడుదలై, పోస్టుకెళ్లాక మా దగ్గిర ఆఫీసు కాపీలు తప్ప ఇంకేమీ మిగలవు. న్యూస్ స్టాండ్స్ ద్వారా అమ్మకం ఏర్పాటు లేదు - అది మాకు ఒక విధంగా గిట్టుబాటు కూడా కాదు. అందుకనే, ప్రతి నెలా చదవాలనుకొనేవారిని చందాదారులు గమ్మని మనవి చేస్తూంటాము. చందాదారుని ఇంటి గుమ్మంలోకి పోస్టులో వస్తుంది పత్రిక. దేశ విదేశాల లోని పాఠకులకు ఆ విధంగానే అందిస్తున్నాము.

ఫిలిమ్ ఫెస్టివల్ విశేష సంచిక కోసం వ్రాసిన వారికి మా విన్నపం : లోగడ స్త్రీల సంచిక, పిల్లల సంచిక పునర్ముద్రించినట్లే, ఈ విశేష సంచిక లోని ముఖ్యాంశాలను, ఇంకో రెండు మూడు నెలలలో మామూలు సంచికలో పునర్ముద్రిస్తాము. అరవై చిత్రాల సంక్షిప్త సమీక్షలు, ప్రపంచసినిమా, భారతీయ సినిమా, స్మృత్యంజలి, మిగతావి అను శీర్షికలు పద్దెనిమిది బొమ్మలతో పునర్ముద్రణ పొందుతాయి.

చందా వివరాలు : 24 సంచికలకు రు 50-00 ; జీవిత చందా : రు 300-00 ; పాట్రన్ : రు 1000-00.

JAGATI Monthly, 2, Kutchery Road, P.B. 2922, Madras-600 004

సీరియల్

# మధు స్వప్న శాఖ

## పృ ్త



గడిచిన కథ : డాక్టరు నాగార్జునకు సౌందర్య దీపం లావణ్య ఒక పేషంటు : మమతల మాధురి విశాల - సివిల్ ఇంజనీరు, అతని జీవిత భాగస్వామి కానున్నది. అనునయ వాక్యాలతో, ఆప్యాయత వెదజల్లే కబుర్లతో లావణ్యను, ఆశల పల్లకీలో తిప్పవచ్చు కాని, పేషంటు పేషంటే. మెత్తని మాట తన వృత్తిలో భాగం కదా! లావణ్యది మంచి మనసే, కాని........ ఇక చదవండి

ఆ శబ్దం ఏమిటి.... మరి బయట గడి పెట్టివుందే.... ఎవరైనా హత్య చేశారా? ఎవరై వుంటారు. ఒకవేళ .... వాళ్ళు వచ్చారా? - అనుకునే సరికి విమ్మి కాళ్ళకింద భూమి కంపించి పోసాగింది. గుండె వేగంగా కొట్టుకో సాగింది. పెదవులు తడారి పోయాయి. తలుపు తెరవబోయింది కాని, ధైర్యం చాల్లేదు. ఈ రాజేష్ ఏమిటి ఇంత నింపాదిగా కూర్చునే వున్నాడు - తను ఒక్కటే వెతుకులాడుతుంటే నిమ్మకు నీరెత్తినట్లు తీరిగ్గా కూర్చుని సిగిరెట్లు కాలుస్తున్నాడు. తలుపు తెరవాలని తలుపు మీద చేయి వేసింది. 'రాజేష్.... రాజేష్....' గట్టిగా పిలిచింది రాజేష్ వచ్చాడక్కడకి.

"ఏమయింది....?" నింపాదిగా అడిగాడు.

"బాత్రూమ్‌లో ఎవరో వున్నారు ఏదో శబ్దం అవుతూంది," అంది విమ్మి భయంగా.

వెళ్ళి తలుపు తెరిచాడు.

లోపల కనిపించిన దృశ్యాన్ని చూచి,.... లిప్తపాటు కలవర పడి పోయింది విమ్మి .... "రాజేష్" భయంగా అతని చేతిని పట్టుకుంది.

"డోంట్ వర్రీ.... విమ్మి...." అని ఆమెను సముదాయించి లోపలికెళ్ళాడు.... అతని వెనుకనే. విమ్మి కూడా వెళ్ళింది.

కాళ్ళూ చేతులూ కట్టేసి,. నోటి నిండుగా గుడ్డలు కుక్కిన నౌకర్ని బంధవిముక్తుడ్ని చేసి,.... "ఎలా జరిగింది .. ఎవరు చేశారీ పని? అని అడిగాడు.

వాడు భోరున ఏడ్చేశాడు.

"శమ్మి ఏది ఎక్కడికెళ్ళింది....?"

"శమ్మమ్మ".... మళ్ళీ ఏడ్చాడు.

"వెధవగాడిదా.... ముందు చెప్పి ఏడ్వు.... అని రాజేష్ గదిమేసరికి

వాడు ఏడుపును గుటకలు మింగి చెప్పాడు "శమ్మమ్మ గారిని.... ఎత్తు కెళ్ళిపోయారు" అంటూనే ఏడ్చేశాడు.

"ఎవర్రా ఎత్తుకు పోయింది....?" విమ్మి అడిగింది.

"వాళ్ళండి.... వాళ్ళు"

"ఎవర్రా వాళ్ళు.... రావణాసురుడా.... బకాసురుడా...."

విమ్మికి రాజేష్ ప్రవర్తన అనుమాన స్పదంగా ఉంది. తను యింత టెన్షన్‌గా వుంటే, అతనికి నవ్వులాటా?

మళ్ళీ ఏడ్చేందుకు ప్రిపేర్ అవుతున్న నౌకర్ని కసిరింది విమ్మి "ముందు అంతా పూర్తిగా చెప్పి.... తరువాత తీరిగ్గా కూర్చుని ఏడ్చుకో.... లేకుంటే ఆ గుడ్డలు మళ్ళీ నీ నోట్లో కుక్కేస్తాను" - తర్జని చూపిస్తూ బెదిరించింది విమ్మి.

బుజంపై నున్న తువ్వాలుతో గట్టిగా ముఖాన్ని తుడుచుకుని, కళ్ళొత్తుకుని చెప్పటానికి సంసిద్ధమయ్యాడు నౌకరు.

"నేను వంటగదిలో వున్నాను, శమ్మమ్మ ఎవరితోటో ఘర్షణ పడుతున్నట్టు వినిపించి, వచ్చి చూశాను. శేషాద్రిబాబు .. వాళ్ళమ్మ, శమ్మమ్మను వాళ్ళతో రమ్మని బెదిరిస్తున్నారు. అమ్మాయి రానంటుంటే - వాళ్ళు ఒప్పుకోలేదు. రమ్మని బలవంతం చేశారు.

'సన్యాసీ - మేము వెళ్ళేందుకు రాలేదు.... నిన్ను మాతోటే తీసుకెళతాం - అందుకే వచ్చాం.... మా మీద కేసు పెట్టి,.... విడాకులు పుచ్చుకుని భరణం గుంజాలని చూస్తున్నావా....? అమ్మో, ఎంత నయవంచన!.... అదంతా కుదరదు' అని శేషాద్రిబాబు.... శమ్మమ్మ ఆ చెంపా .... ఈ చెంపా.... వాయించి పడేశాడు. ఆమె అత్త అయితే మరీను.... పెళ్ళికని.... వంటి మీద నగలు పెట్టి పంపాను.... విడాకులు పుచ్చుకు, ఆ నగలన్నీ నీ సొంతం చేసుకోవాలనా? సన్యాసిదానా, అని శమ్మమ్మ.... జుట్టు పట్టుకుని లాకెళ్ళుతుంటే... నేను అడ్డువెళ్ళాను. నన్ను కొట్టి కట్టేసి నోటిలో గుడ్డలు కుక్కి శమ్మమ్మను తీసికెళ్ళిపోయారు" అంటూ ఏడ్పు లంకించుకున్నాడు.

భయ కంపితురాలైన విమ్మి రాజేష్ దగ్గరగా వచ్చి.... కూర్చుని "ఇప్పుడెలా రాజేష్" అంది కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ

అతను అదోలా నవ్వాడు.

ఆ నవ్వుకి అర్ధం ఏమిటో పసికట్టలేక మళ్ళీ అడిగింది.... "శమ్మి, శేషాద్రితో విడాకులు తీసుకునే విషయం ఎవ్వరికి తెలియదు. తెలియనీయలేదు.... వాళ్ళకెలా తెలిసింది?"

అతను మళ్ళీ అదే నవ్వు నవ్వాడు.

ఆ నవ్వుకి అర్ధం గ్రహించ కలిగింది. తనే రాజేష్‌కు చెప్పింది శమ్మి విడాకులు తీసుకుంటుందని. ఈ రాజేష్ వాళ్ళతో చెప్పి వుండవచ్చు.

"నీవు చెప్పావా.... వాళ్ళకు' అడిగింది.

అతను తలూపాడు అవునన్నట్టు.

"ఎందుకు .... చెప్పావ్ ...." కోపంగా అడిగింది.

"ఎందుకో చెప్పానలే"

"అంటే ?" .... "అది అంతే నీకిప్పుడు అర్థం కాదు." - అతను పెద్దగా నవ్వేశాడు. తను కత్తుల బోనులో యిరుకున్నట్లు.. విమ్మికి భయం భయంగా ఉంది.

## 46

వీణా వాద్యం విన సొంపుగా విన్పిస్తుంటే, నిలబడి వింటున్నాడు. పాములని తన్మయత్వంలో ముంచే ఈ గాన లహరి సప్తస్వరాలతో అనంతకోటి రాగాలై పలుకుతుందా?

ఆ పాట లిప్తపాటు ఆగింది.

"కుశలీ.... ఆపివేసేవే.... పాడు?"

అతను అలా అడిగినప్పుడు ఆమె వదనం ప్రత్యూష మందార మయింది.

వీణను అక్కడ పెట్టి లేచివచ్చింది లావణ్య.

క్షణం వూపిరి బిగపట్టి అలాగే అతన్ని చూస్తూండి పోయింది.

"మీ ఆరోగ్యం ఎలా ఉంది ?" - అడిగాడి నాగార్జున.

"నా ఆరోగ్యానికి ఏమయింది బాగానే వున్నాను కదా !"

"కుశలి అని పిలవమన్నపుడే ఏదో ఇతిహాసం దాగివుందని అనిపించింది .... కాని మిమ్మల్ని తొందర పెట్టటం న్యాయం కాదు, ఏదైనా సమయా సమయాలని బట్టి.... కాలావకాశాలని బట్టి వెల్లడి కావాలి. నీవు ఒక్కదానివే .... సతమత మవుతున్నావు - కలసి పరిష్కారం చేద్దాం.... ఒక విషయం మటుకు మరచిపోవద్దు. నేను కేవలం డాకరుని.... మాత్రమే కాదు - మీ శ్రేయోభిలాషిని మనసుని కుంగ

దీస్తున్న దేమిటో చెప్పేయండి కుశలీ .... రేపటి నుండి ఒక వారం పది రోజులు లీవు మీద వెడుతున్నాను మీకు కనబడను"

తనకు చెప్పాలనే వుంది, కాని.... చెప్పిన తరువాత వీళ్ళందరూ తన నొక వెర్రిదాని క్రింద జమకడితే అప్పుడు పరిస్థితి తారుమారైపోతుంది అనుకుని.... "ఎక్కడికి వెళ తున్నారు ?" అనడిగింది.

తనకు మ్యారేజని చెప్పకూడదు. "ఏదో సెమినార్‌కి"

"మీరు కనపడకపోతే.... నేను బ్రతకలేను,.... డాక్టర్" - రుద్ధ కంఠం తో ప్రాథేయ పూర్వకంగా చెప్పింది లావణ్య.

"మీ అభిమానం.... అనురాగం నాకు తెలుసు. కాని, డాక్టర్‌గా నా విధులు నేను విస్మరిస్తే మీరు గౌరవిస్తారా ?"....

"డాక్టర్, నేను చెప్పేది మీరు నమ్మరేమోనని భయంగా ఉంది"

"కుశలి ఏనాటికి అబద్ధం చెప్పదు"

"మిమ్మల్ని చూసిన మరుక్షణమే దూది పింజంలా ఎగిరిపోయింది మనసు.... మిగిలింది.... ఈ తనువు .... ఒకప్పుడు ఈ తనువు కూడా మిగలకుండా పోతుంది"

"వాట్ ఆర్ యు సేయింగ్ ?.... బి.... ప్లెయిన్ అండ్ సింపుల్" - ఆమె దగ్గరగా వచ్చి అడిగాడు డాక్టర్ నాగార్జున.

నుదురు చిట్లించి.... చేరువగా వున్న డాక్టర్ నాగార్జున మీదకు వరిగింది లావణ్య.

ఆమెను నెమ్మదిగా సోఫా మీద కూర్చోబెట్టాడు.

తల వెనక్కు వాల్చి విశ్రాంతిగా కూర్చుని,.... తగిలించిన షాండిలియర్ వైపు చూస్తోంది.

"రిలాక్స్ అవండి, కుశలీ".... అన్నాడు నాగార్జున.

అతని చేతిని ఆప్యాయతగా తన రెండు చేతులతో పట్టుకుని.... "మీ మంచితనం ఎన్ని జన్మలకైనా.... తరిగిపోనిది...." అంది లావణ్య.

"ఎన్ని జన్మల నుండి ఎరుగుదు రేమిటి నన్ను ?" - అడిగాడు నాగార్జున కవ్వింపుగా.

ఇంతలో శ్రీనివాసరావు అక్కడకు వచ్చాడు. తండ్రి ముందు మర్యాదకు అతని చేయి విడిచిపెట్టింది.

"డాడీ, పూర్వజన్మ అనేది నిజమా.... ?"

పసిపిల్లలా అడుగుతున్న లావణ్యని చూచి.... "అవునమ్మా పెద్దలు చెపు తుంటారు.... పాపపుణ్యాలు, జన్మ కర్మలు గురించీ - ఇప్పుడెందుకు ?"

"ఏమి లేదు, డాడీ.... పునర్జన్మ గురించి ఈ మధ్య ఒక పుస్తకం చదివాను. డాక్టర్, మరి మీ ఉద్దే శ్యం....?"

"అలాంటివి .... నమ్మినా నమ్మక పోయినా.... ఎదుటివారు

చెబుతున్నది ఖండించే స్వభావం కాదు నాది. ప్రతి నమ్మకమూ మనసుకి స్వాంతన చేకూర్చేందుకేనని నేను చదువుకున్నది''.... అన్నాడు.

రెండు చేతులతో ముఖాన్ని సున్నితంగా వత్తుకుని.... సేదతీరినట్టు తల పంకించి.... "మీతో ఈ విషయమే చర్చించాలనుకుంటున్నాను" అంది.

"ఓకే.... ఐ.... యామ్ రెడీ" అన్నాడు నాగార్జున.

"కాని .... ఈ రోజుకాదు.... ఈ సమయంలో కాదు. ఊరికెళ్తున్నానన్నారు .... రేపు పొద్దుటా సాయింత్రమా.... ?"

"రాత్రి ఫ్లయిట్‌కి"

"అయితే రేపు ఇదేవేళ కలుసుకుందాం" అంది లావణ్య.

తన వెడ్డింగ్ కార్డ్ శ్రీనివాసరావుకి యిస్తే,.... పొరబాటున అది ఆమె కంట బడుతుందేమోనని యివ్వకూడదని తీర్మానించుకున్నాడు నాగార్జున.

## 47

లావణ్యను గురించి ఆలోచిస్తూ ఇంటికి చేరుకున్నాడు. ఇంటిలో ఎవరూ లేనట్లున్నారు.... అలికిడి లేదు. లోపలకొచ్చి నౌకర్ని అడిగాడు.

"అమ్మగారు, అయ్యగారు బయట కెళ్ళారు. చందనమ్మ, పెద్దమ్మగారు వంటగదిలో ఉన్నారు" అని చెప్పాడు.

చందన వంట గదిలోనా ? .... ఏదో వింత విన్నట్టుగా ఫీలయి నవ్వుకుంటూ.... అటుగా వెళ్లేసరికి.... చందన కేకలు వినిపించాయి.

"ఏమయింది చందూ ?" వెళ్లి అక్కడ దృశ్యం చూసేసరికి.... అతనికి నవ్వాగలేదు. చెయ్యి కాలినట్టుంది. కాలిన చేతిని ఇంకో చేత్తో పట్టుకుని బిందులు వేస్తూ అరుస్తోంది. గ్రాండ్ మదర్ శాంతమ్మ ఆ అమ్మాయిని సముదాయిస్తూంది.

నాగార్జున నవ్వు విని ఇద్దరూ ఇటు చూశారు.

"అన్నయ్యా .... కాలింది ...." అంటూ ఏడ్చింది.

"అయ్యో మరి నీవెందుకు వచ్చావు .... ఈ డేంజరెస్ ప్లేస్‌లోకి ?"

"అదేమి మాటరా, నాయనా.... ఆడపిల్లకి వంటగది ఎంత ముఖ్యం.... అందులో వండి వార్చి స్వయంగా భర్తకు పెడితే ఎంత ఆనందం!"

"చూశావా, అన్నయ్యా.... గ్రాండ్ మా ఇలా చెప్పి.... నన్ను ఈ గదిలోకి తీసుకొచ్చింది"

"అయ్యో! తల్లీ, నీవే కదా - నన్ను ముందడిగింది, వంట నేర్పమని"

"అవును.... అడిగాను.... నాకు కావలసినవి.... మరి, ఇవన్నీ నేర్పమన్నానా ?"

"డిష్ పట్టుకుని దించడం చేతకాని పిల్లకి ఏం వంట నేర్పేదే, తల్లీ ? - అయినా మీ అమ్మది తప్పంతా.... చిన్నతనం నుంచీ నిన్ను గారం.... చేసింది...."

"మమ్మో తప్పేమిటీ.... ఈవిడగారు నేర్చుకుంటే వదంటుందా....

ఇప్పుడు నేర్చుకోవాలని ఎలా బుద్ధి పుట్టింది....?" అడిగాడు నాగార్జున.

"మా వుమెన్స్ క్లబ్‌లో వంటల పోటీ.... అందరూ ఏదైనా నేర్చుకొని చేయాలి కంపల్సరీగా.... అందుకే గ్రాండ్‌మాని అడిగాను"

"ఇంతకీ ఏదైనా.... చేశావా.... లేక వూరికే చేతిని కాల్చేసు కున్నావా....?"

"ఎందుకు చేయలేదు ?.... ఇవిగో బాదం హల్వా,.... గులాబ్ జామ్" టేబిల్ మీద అమర్చిన వాటిని చూపించింది చందన.

స్పూన్‌తో బాదం హల్వాని తాకి చూశాడు. ఇటికరాయంత గట్టిగా తగిలింది. గులాబ్‌జామ్‌లయితే మరీను .... మసిబొగ్గుల్లా నల్లగా వున్నాయి.

"దీన్ని బాదం హల్వా అనే కన్నా .... ఇటికల హల్వా అంటే బాగుంటు దనుకుంటా.... ఈ గులాబ్‌జామ్‌ని రాక్షిసి.... రైలు బొగ్గంటే బాగా మ్యాచ్ అవుతుందేమో, చెల్లెమ్మా !' అన్నాడు జోక్ చేస్తూ.

చందన చేతిలో వున్న దాన్ని విసిరేసేంతలో నాగార్జున అక్కడ నుండి వెళ్ళిపోయాడు.

రూమ్‌లో కూర్చున్న నాగార్జున మనసులో విశాల మెదిలింది. ఇక కొద్ది రోజుల్లో తన ప్రియ బాంధవి.... కానున్నది.... ముగ్ధ మనోహర రూపం.

లావణ్యా విషయమేమిటో అంతు పట్టకుండా ఉంది.... ఎంతో కాలంగా తనతో పరిచయం ఉన్నట్టు మాట్లాడు తుంది. ఆమె చూపుల్లో ఏదో ట్రాజడీ. అందుకే అలా విరక్తిగా మాట్లాడు తోందేమో. ఏదో చరిత్ర, ఏదో గతం, ఏదో చెప్పాలి.... అందుకు తనని పూతగా వాడుకోవాలని ఆమె వాంఛి

## సినిమా పేరు ?

**'ఎంత మంచి వాడివిరా చక్కని రాజా - నీ**
**దెంత మంచి మనసురా చల్లని రాజా'**

*గేయరచన : మల్లెమాల.... పాడినవారు : సుశీల*

**ఆ పాట ఏ చిత్రంలోనిది ? సరిగా చెప్పగలిగిన మొదటి యిరువురికీ పదేసి రూపాయలు బహుమతి. ఎక్కువ మంది చెప్పగలిగినప్పుడు, చీట్లు వేసి మొదటి యిరువురికే బహుమతి ఇవ్వడం జరుగుతుంది.**

**మీ జవాబు కార్డుమీదనే వ్రాయండి : చివరి తేది : 20-8-1991**

తం.... మోసమో, నాటకమో అని అనుకుందామంటే అలాంటిది ఏమీ లేదు. అటువంటి కపటాలకు.... కల్మషాలకు అక్కడ ఆస్కారంలేదు. మరేమిటి?.... కొందరు పేషంట్స్ డాక్టరంటే ఆరాధనతో ప్రియంగా, సన్నిహితంగా ప్రవర్తిస్తూంటారు. ఈ అమ్మాయి అయితే మరీను! రేపు ఏమిటో చెపుతానంది. ఏమి చెపుతుందో? ఎలాంటి చిత్ర విచిత్రాలు ఏకరవు పెడుతుందో.... "డాక్టర్, మిమ్మల్నే ప్రేమిస్తున్నాను. మీరు నన్ను పెళ్లి చేసుకోవాలి అనేయదు కదా ... కొంపదీసి! అప్పుడా వుచ్చులోంచి.... ఎలా తప్పించుకోవాలి?" ఇటువంటి ఆలోచనలనుంచి తెప్పరిల్లజేసింది ఔషధ చంద్రిక వంటి నిద్రాదేవి.

## 48

సూర్యారావు ప్రమీలా ఇల్లు చేరుకున్నారు. తలుపులు తెరచే వున్నాయి.

"శమ్మమ్మగారిని శేషాద్రి బాబు .... వాళ్ళమ్మ వచ్చి పట్టుకెళ్ళిపోయారు - అడుగా వచ్చిన నన్ను కొట్టికట్టి పడేశారు" అన్నాడు నౌకరు.

"విమ్మమ్మ సంగతి నాకు తెలియదు. ఎటు వెళ్ళారో నేను చూడలేదు"

శమ్మి ఏమయిందో,.... విమ్మి ఎలా పోయిందో తెలియని.... ఆ దంపతులు దిగులు పడిపోయారు.

"పోలీస్ రిపోర్ట్ ఇద్దాం" అంది ప్రమీల.

"ఎందుకు? ఏం ప్రయోజనం? ఇంక నాలుగు రోజుల్లో విశాల వివాహం కదా"

భర్త మాట ప్రకారం.... రాజేశ్వరికి కూడా ఫోన్ చేయలేదు ప్రమీల.

సూర్యారావు చేత టాబిలేట్ మింగించింది. ఆయన కొద్ది సేపటికి మత్తుగా నిదురపోయాడు. ప్రమీల కంటిమీదకు కునుకు రాలేదు. కిటికీలో నుండి నీలాకాశం వైపు చూస్తూ కూర్చుంది. చుట్టూ చిమ్మ చీకటి. అర్ధరాత్రి దాటినా విశాల యింకా యింటికి రాలేదు.

## 49

తెల్లవారింది. నలువైపులా వెలుగు పరుచుకుంది. ప్రమీల గుండె బారంగా వుంది. కనురెప్పలు వాచిపోయి వున్నాయి. రాత్రంతా సోఫాకు తల ఆన్చి పడుకున్నది. సూర్యారావు కూడా లేచాడు. మాటలు కరువైనట్లు చూపులతోనే ఒకరినొకరు ఓదార్చుకుంటున్నారు.

దగ్గరిలోనే వున్న గుడిలో నుంచి ....సుప్రభాతం వినిపిస్తోంది. స్వామి వారి స్తుతి వింటూ కళ్ళు మూసుకున్నాడు సూర్యారావు. ఆయనకు దగ్గరగా, జరిగి మోకాళ్ళపై తల వుంచింది ప్రమీల సుప్రభాతం

వింటూ.... ఇంతలో కాఫీ తీసు కొచ్చాడు నౌకరు.

"కాఫీ.... తీసుకో" - అన్నాడు సూర్యారావు.

"నాకు వద్దండి.... మీరు తీసు కోండి"

"ప్రమీలా, అలా దిగులు పడి ప్రయోజనం లేదు. ఏమి జరగాలో అది జరుగుతుంది. మనం మానవ మాత్రులం.... దైవ నిర్ణయమంటూ ఒకటుంది."

"ఇది దైవం సృష్టించింది కానే కాదు. మానవులు స్వార్థంతో..... కల్పించిన క్లిష్ట పరిస్థితులు. కష్టం దురాశతో శమ్మీని దోచుకున్నారండీ. నిమ్మి ఏమైనట్లు? పోలీసు రిపోర్టు మీరెందుకు అంగీకరించటంలేదు?" ఆమె ఏడుస్తూ అడిగింది.

"వూరుకో.... ప్రమీలా.... ఇంకా సేపు చూసి అలాగే ఇద్దాం.... విశాల కూడ వచ్చేస్తుందిగా.... ఆమె ఎలా చెపుతుందో కూడా చూద్దాం.... దుష్టత్వం లేకుండా ఈ లోకం ఉంటుందా? గ్రహణం పట్టినంత మాత్రాన చంద్రుని కాంతి తగ్గుతుందా?" అంటూ కాఫీ అందించాడు సూర్యారావు.







అరగంట సేపు బీరువా తాళాలు వెతికి "కనిపించడంలేదు. ఎక్కడ పెట్టివుంటారు ?" - అనుకుంటూ బీరువా దగ్గరగా వచ్చింది ప్రమీల. తాళాలతో అవసరం లేకుండానే బీరువా తెరచి వుంది. ఎప్పుడూ లాక్ చేసి వుంచే బీరువాని.... ఎవరు తెరిచారు - ఆశ్చర్య పోయింది ప్రమీల.

బీరువా లోపలంతా కాళీ - లోపల అరలు కూడా కాళీ.... విశాల కొత్త నగలు కూడా లేవు.... డబ్బు.... నగలు, పెద్ద పట్టుబీరలు వెండి సామాను ఏమీలేదు.... నిశ్చితార్థం రోజు విశాలకు.... వాళ్ళు పెట్టిన రవ్వల నెక్లెస్ కూడా లేదు. అసలే దుఃఖంలో వున్న ప్రమీల ఈ దారుణానికి ఓర్చుకోలేక పెద్దగా అరుస్తూ కుప్పలా కూలిపోయింది.

## 50

రాత్రంతా తాగిన మైకంలో, రాజేష్‌తో కలసి శారీరక సుఖాలను అనుభవించిన విమ్మి.... తెల్లవారి ఎనిమిది గంటలకు మేల్కొంది. అప్పటికే రాజేష్ లేచి, ఎవరితోటో ఫోన్‌లో మాట్లాడుతున్నాడు. "ఈ రోజే జరిగిపోవాలి.... లేకుంటే వీలుపడదు. ఆ .... ఇక నాలుగు రోజులే.... లీవ్‌లో ఇంటిలోనే వుండిపోతుంది. ఆ తరువాత అసలు వీలుపడదు.... అందుకని ఈ రోజే అంతా జరిగిపోవాలి," అని చెప్పివచ్చి..., "విమ్మి ఎప్పుడు లేచావు ?" అనడిగాడు.

"ఎవరితో మాట్లాడుతున్నావు.... ఏమిటి జరిగిపోవాలి....?" అనడిగింది. ఆమె నిషా ఇంకా దిగినట్లులేదు. మాటలు ముద్ద ముద్దగా తడబడుతున్నాయి.

"ఏమీ లేదు గాని... నీవేమిటి... ఇలా వున్నావు.... ?"

"ఎలా.... ?"

"ఆసుపత్రి నుంచి పారిపోయి వచ్చిన పిచ్చి పిల్లలాగ."

"అవును రాజేష్.... విషవలయంలో యిరుక్కుపోయాను."

"విషవలయమా.... ఇది.... నీకొక కొత్త జీవితాన్ని చూబుతూంటే...." ఆమెను రెండు చేతులలో బంధించి, నలిపేశాడు.

"ప్లీజ్, రాజేష్, విడిచిపెట్టు. ఎందుకింత విపరీతంగా ప్రవర్తిస్తున్నావ్ ?"

"ఇదంతా.... మీవాళ్ళ మీద కక్ష" - అన్నాడు వికారంగా నవ్వుతూ.

కోరికల నిషా, తాగిన మైకం ఒక్కసారిగా దిగిపోయాయి. "రాజేష్ నీ మాటలు నాకర్థం కావటం లేదు."

"ఇప్పుడు.... నీకర్థంకావు.... ఇంకా రెండు రోజులు పోతే.... అన్నీ అర్థం అవుతాయి."

"అంటే ?"

"అంతే.... అప్పటికి.... ఇద్దరం ఒకరినొకరం బాగా అర్థం చేసుకోగలం"

ఆమె రోదన వినిపించుకోక, పశువుగా మారిన రాజేష్, వేడి చల్లారక లేచాడు.... ఆ క్షణంలోనే విమ్మి సగం చచ్చినట్లు ఫీలయింది.

అతను లేచి కూర్చుని, ఆమెను లేపి కూర్చోపెట్టి, "విమ్మి డార్లింగ్, నీవు చాలా ఏమోషన్ తెప్పించే ప్రియతమవి.... అందుకే బలవంత పెట్టాను.... నన్ను అపార్థం చేసు కుంటావా ?''

ఆ పొగడ్తకు కరిగిపోలేదు గాని, గతం తలుచుకు విగురుటాకులా వణికిపోయింది.

"వెళ్ళి స్నానం చేయి.... నా ఫ్రెండ్స్ వచ్చే వేళ అయింది.''

"రాజేష్.... నాకెందుకో చాలా భయంగా వుంది.... మనం తిరిగి ఇంటికి వెళ్ళిపోదాం....''

"ఇంటికా ? మనమా?'' - బిగ్గరగా నవ్వాడు.

"ఎందుకలా నవ్వుతావు.... ?''

"నీకు జైలులో కెళ్ళి కూర్చోవా లని చాలా ఆశగా వున్నట్టుంది. నీవు ....వెళ్ళు, నేను మటుకు రాను. నా ప్లాన్ నెరవేరాలి....''

"ఏమిటా ప్లాన్.... ?''

"చెప్పినా నీకరం కాదులే.... చూసావుగా''

.. హార్ట్ పేషంట్, ఎలా వున్నారో.... మమ్మీ ఎలా.... ఏడు స్తోందో ! శమ్మిని వాళ్ళేమి చేశారో ? రాజేష్, డాడీ ఏమి అనరు. తప్పక క్షమిస్తారు. విశాల మ్యారేజి కూడా జరిగిపోతుంది. నా మాట విను, రాజేష్.... వెళ్ళిపోదాం. చాలా పొర పాటు చేశానని ఇప్పుడనిపిస్తూంది.''

"విమ్మీ నికేమయినా మతి పోయిందా ? ఈపాటికే పోలీసులు వెతుకుతుంటారు. అంత ఇష్టంగా వుంటే నా పని పూర్తయ్యాక నిన్ను పంపించేస్తాను''

"ప్లీజ్, రాజేష్.... టవలు.... చీర అవి తెచ్చుకోవాలి.... తలుపు తెరువు....''

తలుపు తెరవాడు. విమ్మి ఏమీ మాట్లాడకుండా వెళ్ళి సూట్ కేస్ తెర చింది. ధగధగ మెరిసే పట్టుచీరలు నగలు.... ఈ సూట్ కేస్ తీసుకుని పారిపోతే ?.... అవును, అవసరానికి వాడుకుని.... వదలేసేట్టున్నాడు. నా జీవితాన్ని దగా చేసుకున్నాను కనీసం .... కన్న వాళ్ళనన్నా ఆపద నుండి తప్పిస్తే... చేసిన పాపానికి కొంతైనా ప్రాయశ్చిత్తం లభిస్తుంది.

✠ ✠ ✠

స్నానం ముగించి వస్తున్న విమ్మికి వినిపించాయి మాటలు.... ఆ మాటలు చెవుల పడటంతో ఆమె కాళ్ళు టక్కున ఆగిపోయాయి. పూర్తిగా వినక పోయినా, లీలగా ఆమెకు అర్థమై పోయింది. అర్థమయ్యేకొలదీ కాళ్ళు వణికి పోయాయి. ప్రపంచమే తల క్రిందులైనట్టు, ఒక వూబిలో కూరుకు పోతున్నట్టూ అనిపించింది. ఏమి చేయటానికి తోచని ఆమెకు, కన్నీళ్ళే శరణ్యమైనట్టు జరజరా.... బుగ్గల మీదకు ప్రవహించాయి. మేక వన్నె పులి కప్పుకొన్న ముసుగు తొలగి పోయి, అసలు రూపం బయట పడు

తోంది. తను మోసపోయింది. అలా, ఇలా కాదు, ఘోరంగా మోసపోయింది.

ధైర్యాన్ని కూడతీసుకుని తొంగి చూసింది. రాజేష్ చుట్టూ నలుగురు గూండాటైప్ కూర్చుని వున్నారు. వాళ్ళ చేతుల్లో హాట్ డ్రింక్స్ ఉన్నాయి. ఆ డ్రింక్స్‌ని కొద్ది.... కొద్దిగా సిప్ చేస్తూ రాజేష్ చెప్పేవన్నీ శ్రద్ధగా వింటున్నారు. ఆ మాటలన్నీ విమ్మి చెవుల పడుతున్నాయి. శరీరానికి చీర చుట్టుకున్నా, వేడిసెగలు వెలువడుతున్నవి.

వాళ్ళ ముందుకి వెళితే,.... తనని షూట్ చేస్తారేమో అనుకుని గోడ వారగా కూర్చుంది. తన మొర ఆలకించే వారెవరు ? వాళ్ళు వెళుతున్న అలికిడి విని లేచి నిలుచుని చూసింది. నలుగురూ బాగా దృఢకాయులు. మదించిన అంబోతులు.

తను బయటపడే దారి ఆలోచించ సాగింది - ఆ రూమ్‌కు వున్న ద్వారం ఒకటే. ఆ ద్వారంలో కాటు వేసే విషసర్పం.... దాన్ని.... దాటుకుని వెళ్ళలేదు ; వెళ్ళితే కాటువేస్తుంది. వెళ్ళకున్నా .... విషవలయంలో చిక్కుకున్న తనకి ఈ విషపు కాటు తప్పదు....

## 51

రాజేశ్వరి, చందన.... ఇద్దరూ షాపింగ్‌కి వెళ్ళి రెండు గంటలయింది. రాజేశ్వరి ఇంకా.... ఇంకా కొంటూనే వుంది, చందనకి చాలా బోర్ అనిపించింది.

చివరికి .... అన్నీ కారులో పెట్టించుకుని బయలుదేరారు. డ్రైవరు కారు నడుపుతున్నాడు.... వీళ్ళిద్దరూ వెనుక సీట్లో కూర్చుని కొన్న వస్తువుల గూర్చి మాట్లాడుకుంటున్నారు.

ఇద్దరూ ఏమిటా అని చూశారు. రెడ్‌లైట్ దగ్గర కారు ఆగింది. వాళ్ళ కారు ప్రక్కనే ఓ నీలిరంగు కారు వచ్చి ఆగింది.... దాని అద్దాలన్నీ మూసి ఉన్నాయి.... డ్రైవరు దగ్గర అద్దం మటుకు తెరచి ఉంది. సడన్‌గా వెనుక సీటు అద్దం తెరచుకుంది. అందులో నుండి ఒక స్త్రీ తల.... బయటకు పెట్టి.... వాంతి వచ్చినట్లు .... 'ఓక్.... ఓ.... క్' అని శబ్దం చేస్తూ దగ్గరగా ఉన్న.... చందన వాళ్ళ కారు డోర్‌మీద చేయి వేసింది.

ఆ కారులోని స్త్రీ ఇంకొంచెం ముందుకు వంగింది.

ఇద్దరూ ఆమె వైపు చూశారు ఆమె ముఖంమీద ముసుగు ఉంది. ఆ ముసుగులోంచే ఆమె వాళ్ళను చూసింది.

ఎవరా అని ఆశ్చర్యంగా చూస్తున్నారు. దీనావస్థలో ఉంది.

"చందనా .... ప్లీజ్ పోలీస్ కంప్లయింట్ ఇవ్వు.... నేను చాలా .... ఆపదలో ఉన్నాను...." అని ఆమె చెపుతుండగానే.... కారు లోపలున్న వ్యక్తులు ఆమెను లోప

లకు లాగటం, కారు వెళ్ళిపోవటం
లిపపాటులో జరిగిపోయింది.

## 52

నాగార్జున హాస్పటల్ నుండి ఇంటికి వచ్చాడు. ఇంటిలో .... చందన, రాజేశ్వరి లేరు. అతను పేపరందుకుని కూర్చున్నాడు .... లావణ్య గురించి ఆలోచిస్తూ.... ఈరోజు ఆమె ఏదో చెపుతానంది. ఏమి చెబుతుందో.... ఎలాంటి విషయాలు వినవలసి వస్తుందో చూడాలి...

"మీకు కాఫీ తెమ్మంటారా....?" అని అడిగాడు నౌకరు.

"ఇప్పుడే వద్దు, తర్వాత తీసుకుంటాలే" అని చెప్పాడు.

శాంతమ్మ వచ్చి నాగార్జున ఎదురుగా కూర్చుంది. "పీళ్ళు వెళ్ళి....చాలా సేపయింది. ఇంకా రాలేదే....?"

"వస్తారులే గ్రాండ్‌మా...."

శాంతమ్మ పురాణం మొదలు పెట్టింది. చేతిలోని పేపరు పక్కన పెట్టి వింటున్నాడు.

"విశాల లాంటి అమ్మాయి దొరకటం.... నిజంగా నీ పూర్వపుణ్యం.... ఈ రోజుల్లో అంత అణకువ అయిన పిల్ల దొరకటం బహు కష్టం. అంత చదువుకొన్నా, ఏమి వినయం.... ఎంత బిడియం...."

విశాలను గురించి వినేసరికి.... ఇతర ఆలోచనలన్నీ అంతరించి.... మనసున మల్లెలు గుబాళించాయి.

శాంతమ్మ ఏదో చెపుతోంది కాని నాగార్జున మనసంతా విశాల చుట్టూ అల్లుకుపోయింది. ఆమె చిరునవ్వులు .... సన్నజాజులై మదిని పులకింప చేశాయి.

కారు దిగిన చందనా, రాజేశ్వరి ఆందోళనగా లోపలకొచ్చారు.

"ఏమయిందమ్మా...." అడిగాడు నాగార్జున.

"మమ్మీ.... నేను.... షాపింగ్ ముగించుకుని.... కారులో ఇంటికి.... వస్తున్నాం.... రెడ్‌లైట్ దగ్గర కారాగింది. మా పక్కనే ఇంతలో కారు వచ్చి ఆగింది.... ఆ కారు అద్దాలన్నీ మూసి వున్నాయి. అపుడే ఒక అద్దం తెరుచుకుంది. ఒకామె వాంతి చేసుకుంటున్నట్లు ముందుకి వంగి, మాతో ఇలా చెప్పింది. "చందూ.... నేను ఆపదలో వున్నాను పోలీస్ కంప్లయింట్ ఇవ్వు"

"ఆమె ఎవరై వుంటుంది?"

"విశాల గొంతులా వినిపించింది" అని చెప్పింది రాజేశ్వరి.

"లోపల ఎవరెవరున్నారు....?"

"అదీ.... తెలియదన్నయ్యా.... కారు గ్లాసెస్‌కు కర్టెన్స్ వేసి వున్నాయి లిప్తపాటులో జరిగిపోయింది. ఏది గమనించేందుకు కూడ అవకాశం లభించలేదు. డ్రైవరు కూడ గమనించలేదట."

ప్రమీలాంటీకి ఫోన్ చేస్తే విషయాలు తెలియవచ్చు...." అని ఫోన్

చేసింది. అక్కడ ఎవరూ ఫోన్ రిసీవ్ చేసుకోవటంలేదు.

వెళ్ళి కనుక్కుందాం, అని ఇద్దరూ బయలుదేరారు.... అక్కడ కెళ్ళేసరికి ఇంటికి తాళం పెట్టివుంది.... ఎవరూ లేకుండా ఏమైపోయారు ? ఏమిటి ? చాలా ఆశ్చర్యంగా వుందే! అని పక్కవాళ్ళ నడిగారు. వాళ్ళూ తెలియ దనిచెప్పారు. రెండు రోజులనుండి ఏదో గొడవపడుతున్నారు. ఏ విషయ మైనదీ మాకూ తెలియలేదు - అని చెప్పారు.

నాగార్జున, చందనా పోలీస్ స్టేషన్‌కి వెళ్లారు.

"బాగా గుర్తు చేసుకోండమ్మా ఆమె ఎవరై వుంటుందో" అన్నాడు యస్. ఐ.

"పైట కొంగు బాగా వుంది. సడన్‌గా వాళ్ళు లోపలకు లాగి గ్లాసెస్ మూసేశారు. సడన్‌గా జరిగిన దానికి మేము ఆశ్చర్య పోయాము. నన్ను పేరెట్టి పిలిచే సరికి మాకు తెలిసినవారే అయివుండా లనిపించింది."

"సరె, మీకెవరి మీదయినా అను మానం వుందా... ?"

"ఒకసారి విశాల.... చెప్పింది.... వాళ్ళ చెల్లెలు శర్మిలను వాళ్ళ అత్త గారు బాలా కష్టపెడుతున్నారని.... అంతే! అంతకు మించి ఏమీ తెలి యదు."

"వాళ్ళ అడ్రసు చెపుతారా....?"

"అది కూడ తెలియదు."

అక్కడ నుండి విశాల ఆఫీసు కెళ్ళారు.

ఆమె ఆఫీసు నుండి వెళ్ళి చాలా సేపయినట్టు చెప్పారు. ఆ విషయం ఇంకా ఆశ్చర్యాన్ని కలిగించింది. అయినా ఈపాటికి ఇల్లు చేరి వుండ వచ్చు.... అని.... ఇంటికి వచ్చారు. కాని, ముందు వేసిన తాళం అలాగే వుంది.

చందన ముఖం ఆందోళనగా వుంది. ఏమి జరిగిందో... వాళ్ళకేమీ అర్థం కాలేదు. రెండు నిమిషాలు అక్కడే నిలుచున్నారు.

"అన్నయ్యా ఇంటికెళ్ళి డాడీతో చెబుదాం - ఎన్‌క్వయిర్ చెయిస్తారు" అంది చందన.

మళ్ళీ కారులో కూర్చున్నారు. కారు స్టార్ట్ చేయబోతుండగా ఎదురుగా ఒక టాక్సీ వచ్చి ఆ ఇంటి ముందాగింది.

## 53

ప్రొద్దట నుండి మంచినీళ్ళు కుడా లేకుండా నోరు తడారిపోతోంది విమ్మీకి. తన పరిస్థితి ఆమెకు జాలి కలిగించలేదు.... అసహ్యం వేస్తున్నది కళ్ళల్లో కన్నీళ్ళు ఇంకి పోయాయి. ఎలా బయట పడాలి.... ? ఏమి చేయాలి ? ఏడుస్తూ కూర్చునే దానికిది సమయం కాదు.

(ఇంకా వుంది

JAGATI Telugu Monthly - Vol. 36 - No 421 - Aug 91
Edited, Printed and Published by N. R. Chendur at
MANASA PRESS, 2 Kutchery Road, Madras- 600 004
Phone : 76697